శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః.

# ఉపోద్ఘాతము.

---

అభిరూప శేఖర మహాశయులారా!

మొగమునకు ముక్కందము. గ్రంథమున కుపోద్ఘాత మందము. ఉపోద్ఘాతము, కవిచరిత్రము కవితావైచిత్ర్యము కవిసామర్థ్యాసామర్థ్యములు గ్రంథస్థగుణదోషములు విశేషములు మున్నగువిషయముల నుద్ఘాటించును. కావున నీగ్రంథమున కనతివిస్తరముగ నొక్కయుపోద్ఘాతము వ్రాసి పాఠకలోకమునకు సమర్పించుకొనుచున్నాఁడ.

## మహానంది.

ఇది సుప్రసిద్ధక్షేత్రములలో నొక్కదివ్యక్షేత్రము. ఇయ్యది శ్రీశైలమునకు దక్షిణద్వార మని స్థలపురాణమువలనఁ దెలియఁబడుచున్నది. ఈక్షేత్రమాహాత్మ్యము స్కాందపురాణములో శ్రీశైలఖండమునందు వర్ణింపఁబడి యున్నది. కాన నీక్షేత్రము మహాక్షేత్ర మని వేఱ చెప్పనక్కఱలేదు. ఇది గాక యింతనాస్తికతాపరాయణం బైనయీకలిలోకమునయిత మేఁటేఁట నేకోత్తరవృద్ధిగ నీక్షేత్రమునకు వచ్చి సేవించి పోవుచుంట యెల్లరకుం దెలిసియే యున్నది. ఇట్టికాలమున నయిత మింత యాకర్షకముగా నుంట కియ్యది మహామహిమాంచిత మైన దివ్యక్షేత్ర మని చెప్పుట కిది ప్రత్యక్షప్రమాణమే గదా! ఈక్షేత్రమాహాత్మ్యమును వర్ణించినగ్రంథమే యీ

## మహానందిమాహాత్మ్యము.

సంస్కృతములోని స్కాందపురాణాంతర్గత శ్రీశైలఖండమందలి మహానందిమాహాత్మ్యము నాధారముగాఁ జేసికొని కించిత్స్వకపోలకల్పితముగా నీగ్రంథ మాంధ్రభాషలో సంతరింపఁబడినది. ఇయ్యది షడాశ్వాసముల పద్యకావ్యము. దీనిని రచియించిన కవిమహాశయుఁ-

## శేషయసూరి.

ఈయన వైదికబ్రాహ్మణులలో తెలగాణ్యము అనుశాఖలోఁ జేరిన వాఁడు. శాండిల్యసగోత్రుఁడు. ఇతనియింటిపేరు అన్నావఝ్ఝలవారు. తండ్రి తిమ్మాభట్టు. తల్లి సీతమ్మ. ఇతఁడు నిజవంశావళిలోఁ దన మాతామహుని మాతామహిని మేనమామను బినమేనమామను గుఱించి (పీ. 21 ప.) చెప్పికొన్నవాఁడే గాని తనతాత ముత్తాతలమాట తలపెట్టినవాఁడు గాఁడు. తనమాతామహాదులు

> ‘ సురపురవరనృపాలసుసన్మానవిభవులు కీర్తిపరులు
> బుధజనంబుల దీనులఁ బ్రోచువారు ’

అని పీఠికలో వ్రాసినట్లు చాలప్రసిద్ధులుగా నుండుటంబట్టి కాఁబోలు వారిం బేర్కొనినవాఁడు. అయినను మాతామహసాంప్రదాయమును వర్ణించినవాఁడు పితామహసాంప్రదాయమును మాటమాత్ర మైన నెత్తకుంట కేమి హేతువో యని విమర్శకులకుం దట్టెడిని. ఈకవి నివాసము కర్నూలు మండలము కోయిలకుంట్ల ఖండములోని నోసము అనుగ్రామము. ఇతఁడు తనగ్రామము నిట్లు శబ్దచిత్రముగా వర్ణించియున్నాఁడు.

సీ. వేద శాస్త్ర పురాణ ♦ వేదాంతకావ్యాది,
గాఢవిద్యలకు బో♦క్కసము నోసము
కుత్సిత కుహక ♦ కుటిల దురాచార,
కఠినచిత్తులకు వె♦క్కసము నోసము
యాయజూకహితాజ్య♦యజనసంతర్పిత,
కామారిముఖదివౌ♦కసము నోసము
వాసుదేవ శివాను♦వాదు లుఁడుటఁజేసి,
కాలుగుండెకుఁ గర♦కసము నోసము

తే. అర్థిసాత్కృతపక్వాపా♦యసము నోసము
హర్మ్యచుంబితసద్విహా♦యసము నోసము
వేంకటేశ్వరకంజాత♦బిసము నోసము
భవ్యశాస్త్రార్థపటలీర♦భసము నోసము. పీ. 16.

జననీ జన్మభూమి శ్చ స్వర్గా దపి గరీయసీ ’ యని గదా ! పెద్ద లందురు.

ఈకవి, తాను రాఘవదేశికునివలన నాటకాలంకారసాహిత్యముఁ బడసినవాఁడ ననియు, సంస్కృతాంధ్రములయందుఁ గావ్యరచన సేయువాఁడ ననియుఁ బీఠికలోఁ (25 ప.) జెప్పుకొనియున్నాఁడు. కాన నీయన నాటకాలంకారసాహితి యని తెలియుచున్నది. మఱియు సీతారామసేవాధురంధరుం డని గద్యము బోధించుచున్నది. ఈయన 60 సంవత్సరములు జీవయాత్ర గడపినవాఁడు. ఈయనకు ముదిప్రాయములోఁ గవితాకాంత లభించుటయు నిదే కృతికన్యం బడయుటయుఁ దటస్థించె నని యెఱిఁగినవారు చెప్ప విందుము. కాఁబట్టియె కాఁబోలుఁ గవితాకాంత కర్మానుసారముగ ముదిప్రాయమువానిపాలం బడవలసి పడి మనసు వచ్చి రానిదానియట్లు తన వలపులం దెలిఁగించుచు సామాన్యముగఁ బదవిన్యాసములందును శయ్యాపద్ధతు లందును గొంచెము పెడమొగము పెట్టుచు వచ్చిన ట్లగపడుచున్నది! అద్దిరా! మనపెద్దలు ‘ వివాద శ్చ వివాహ శ్చ సమయోరేవ శోభతే ’ అనుట దీర్ఘాలోచనమీఁది మాటయే గదా! ఈయన 20 సంవత్సరముల క్రిందటఁ గాలధర్మము నొందినవాఁడు. వీరి వంశమువా రిప్పు డున్నారు.

ఈగ్రంథము1895 సంవత్సరము కవిజీవితకాలములోనే కొప్పూరి పట్టాభిరామయ్యగారిచేఁ బరిష్కరింపఁబడి యొకమాఱు కడపలో ముద్రింపఁ బడినది. పదంపడి నంద్యాల వాణీనికేతనముద్రాక్షరశాలయందు బ్రహ్మశ్రీ భైరవజోస్యుల మహానందయ్యగారిచే రెండుమారులు ముద్రింపింపఁబడినది. తెక్కనకవిత్వము కొంత తనపైత్యము కొంత యన్నట్లు మొద లున్నప్రమాదము లటుండ మొదటిముద్రణములోఁ గొన్నిపొరపాట్లును దరువాతిముద్రణములలో మఱిన్ని తప్పులును బడి గ్రంథ మాద్యంతము నగమ్యగోచరముగా నుండెను. ఇట్టిదీనిని మరల ముద్రింపఁదలఁచి శ్రీమహానందయ్యగారు పరిష్కరణార్థమై నా కిప్పించి నన్ను భాషాసేవాదీక్షితుం జేసినందుల కే నెంతయుం గృతజ్ఞుఁడ. ఇంతియ గాక, యీగ్రంథములోని వాఙ్మయాంశములం బరికించి వీనిం బరిష్కరింప వలె నన్న సంపూర్ణస్వాతంత్ర్య ముండ వలసియుండు నని నేఁ గోరఁ దాము లోకహితార్థులే యగుటఁ బాఠకలోకమున కుపయోగపడి గ్రంథము బాగుపడుటయే మాకుఁ గావలసినది; గాన నీసొంతగ్రంథముగాఁ జూచుకొని నీ చేత నైనంతవట్టు పరిష్కరిం[illegible] వలసినది గా నాకు స్వాతంత్ర్య మొసఁగినందులకు భాషాసేవకుఁడ [illegible]నే నెంతేనియుం ధన్యవాదము లర్పింపవలసినవాఁడ నై కొండొక్క మఱియు

చున్నాఁడ. ఇందుఁ బూర్వ్వ మున్నరీతిని దానిపై నాచేసినకృషిని బండిత పాఠకలోకమునకు విశదపఱతును. ఎద్దియేని లోప మున్న మన్నింప వేఁడుకొనుచున్నాఁడ. ఎవ్వఁడును సర్వజ్ఞుఁడు గాఁడు గదా!

## కవి

కం బ్రహ్మాణం వేత్తీతి కవిః (పరబ్రహ్మము నెఱిఁగినవాఁడు కవి) అనువ్యుత్పత్తివలన బ్రహ్మజ్ఞుఁడే కవి యనఁబడుచున్నాఁడు. కానివాఁడు 'కవియనునామంబు నీటికాకికి లేదే?' అని యన్వయించి హేళనసేయఁ బాత్రుఁ డగుచున్నాఁడు. ఈయుభయపక్షములవారు ననాదిగా నుందురే గాని క్రొత్తవారు గారు. ఇందు రెండవపక్షమువారు తమజీవితకాలములోనే యూరుపేరు లేకపోవుచుండవచ్చును. మొదటివారు నాఁటికిని నేఁటికిని స్థిరజీవు లై యుండవచ్చును. కనుకనే తాలు తవక లేక యట్టి బ్రహ్మజ్ఞులకృతులే నిలుచుటయుఁ గక్కుంగలవారిప్రసక్తియే లేకుంటయు నేఁటికి మనకు దృష్టాంతముగాఁ గనఁబడుచున్నది.

## కవిత.

కవిత యనఁగా మానవునియం దుండునొక్క ప్రజ్ఞావిశేషకృత్యము. ఇది పూర్వజన్మార్జిత పుణ్యవిశేష పరిపాకఫలాయమానము.

యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా,
తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్.

అని గీతలలోఁ జెప్పఁబడినట్లు ఇదియు నొక్క విభూతిమత్త్వమే యగుటఁ భగవదంశాంచితంబు నగు. ఈకవితాకళ ప్రజ్ఞావిశిష్టమైన ప్రతిప్రాణి యందును స్ఫురించుచునే యున్నది. కాని తత్స్ఫురణమున కుద్బోధకము లైన పరికరములచేఁ గొన్నియెడల నతిశయించుటయుఁ దదభావముచేఁ గొన్నియెడల నంతరించుటయుఁ దటస్థించుచున్నది. గొల్లపిల్లవాఁ డాలమందలం గాయుచు నేలపాటలు పాడుచుఁ, బాడుచు నేదోయొకవిషయము తోడి బాలురతోఁ జెప్పఁదలఁచి యాపాటలపద్ధతినే పాడుచున్నాఁడు. చిన్నపిల్ల యచ్చనగాయ లాడుచుఁ బందెము గెలిచినపుడు తనయుత్సాహమును [illegible]ంతమాటలతో నొక్కపాటగాఁ బాడుచున్నది. ఇట్లాబాల గోపాలము కవితాకళ యావహించి యున్నట్లే స్పష్టమగుచున్నది. అట్లని కవిత

యన నీలాటిదే యని చెప్పుట గాదు. కళాంశ మంతటను నిండియే యున్న దనుట. ఈకళాంశము మానవుఁ డార్జించు సాధనసంపత్తిం బట్టి విరివియై విలాసభాసురమై విశ్వ మంత తన్మయముగాఁ జేసికొనుచున్నది. అయ్యది యిట్లు వృద్ధిఁ బొందుట కుపాధియైన మానవుని ప్రజ్ఞలో నున్నది. ప్రజ్ఞా బలమునఁ గవితాకళను బోషించి యభివృద్ధి చేసికొనినఁ జేసికొనవచ్చును. కాని యందలిసౌష్ఠవము, దానం గల్గుమార్దవము, అద్దానిలోని మాధుర్యము, అందులోని హృదయంగమత్వము ప్రాప్తింపవలె నన్నఁ దలక్రిందుగఁ దపసు పట్టినను బ్రాప్తించునదిగాదు. దాని కిహజన్మపూర్వజన్మసంస్కారములు బాగుండి యుండవలయు. ఇంకను నిదే గొడవ పెంచక విషయాంతరమునకుఁ బోవుదము.

## విమర్శనము.

వాఙ్మయ మంతులేనిసముద్రమువంటిది. దీనితత్త్వము తెలియుట దుస్సాధ్యము. అయినను గొంతవఱ కైనం దెలియక పోయిన నతఁడు పండితకవి యని యనిపించుకొనఁడు. ఎంతవాఁడేనియు నిందుఁ బ్రమాద పడక కృతార్థుఁ డైనవాఁ డరుదు. అందులోను నాంధ్రమున మఱింత చిక్కు. ఇట్టి చిక్కులోనే ప్రమాదములు గూడ ఘటిల్లునది. ఆప్రమాదముల నిద మిత్థ మని వ్రేలు చూపి చెప్పుట శ్రేయస్కాముఁ డైనవానికి విధి యై యున్నది. వాఙ్మయవిమర్శనమువలన రచయితను దూషించుటయే ప్రధాన ముగా విమర్శకుఁడు తలపోయఁడు. సాధ్యమైనంతలోఁ దనబుద్ధికౌశలము నుపయోగించి తొలఁగఁద్రోయునే చూచును గాని లేనివి గూడ నెత్తిన పెట్టఁ బోఁడు. ఇది మల్లినాథాదులు వేసిన బాట.

> నిర్గుణే తు గుణగ్రాహీ గుణే నిర్గుణవాదనః,
> తా వుభా వ ప్యరసికా వితి వ్యాశంసంతి పండితాః.

అన్నట్లు గుణరహిత మైనదానిని గుణవంతముగా నున్న దనుటయు నరసికతయే. గుణసంపన్న మైనదానిలో గుణగ్రహణము సేయకపోవుటయు నరసికతయే యగుచున్నది. కాన నోపండితపాఠకమహాశయులారా ! యాథార్థ్యము చెప్పక తప్పదు. ఏతత్కవికృతగ్రంథము సర్వాంగసుందర మనుట గాదు గాని యొకకావ్య మాంధ్రభారతి కాభరణంబుగా సమర్పింపఁబడిన దనుట సమంజసము.

# 6

## క వి తా ర చ న.

కవితారచనలోఁ బెక్కునిబంధనము లున్నవి. అవి యన్నియుఁ బ్రత్యక్షరగండములు. ఆగండముల నన్నిటిని గడచి గట్టెక్కిననే కృతార్థత. లేకున్న రసాభాసమే. ఇందు గణ యతి ప్రాసములు కవి పాలిటి కంఠపాశములు. ఇవియే కవియొక్క సమర్థతాసమర్థతలం జాటునవి. ఇవి సరిగా నడిచెనా సరియే. లేకున్న వీనికై సంతరించిన పదములను, పడికట్టురాళ్లనియు, యతిపూజ లనియు పేరుపెట్టుదురు. రచనలో నొకశబ్ద మపశబ్దము పడినపుడు కవి ప్రౌఢుఁ డయ్యేనేని యది ప్రమాద మనియు నసమర్థుఁడయ్యేనేని యపభ్రంశ మనియు నందురు. మనకవి యీగాఁటిని దప్పించుకొనలేక పోయినవాఁడే యయ్యె నని యనక తప్పదు. అట్టిస్థలములలో స్వకీయ గ్రంథబుద్ధితోఁ జూచుపరిష్కర్త యుపేక్షించునేని భాషాద్రోహి యయ్యెడుఁ గాన నందందు ఈభాషాసేవకుఁడు చేసినమార్పులను దొల్లిటిరూపములను ముందు పొందుపఱచెదను. జిగీషామనీషం దూరము చేసి పౌర్వాపర్యములోని సౌష్ఠవమును జిత్తగింతురుగాక. మఱొక్కవిషయముం గూడఁ బండితలోకముం బ్రార్థింపవలసిన దున్నది. భారము వహించినతరువాత మోయక తప్పదుగదా! ఏదియో కించిజ్జ్ఞత్వముతో నాస్థూల బుద్ధికి గోచరము గాని విషయము నొకవేళ సరిగా దని మార్పుచేసియున్నను జేసి యుండవచ్చును. ఇంకను నాకుఁ దెలియక యప్పటియవకాశముం బట్టి వదలిపెట్టినవియు మఱికొన్ని గలవు. అట్టిచోట్ల (?) ఈగుర్తుగూడఁ బెట్టఁబడినది. వీని నన్నిటిని గుణగ్రహణపారీణు లైనసరసమతులు సమంజసముగఁ బరిశోధించి తెలుపుదురేని శిరసా వహించి పునర్ముద్రణములో సవరింపవలసినవి సవరింతుము.

పరిష్కరణ మనునది చులక నైనపని గాదు. కవి పరోక్షమున నందక్కవిహృదయ మారసి స్వేచ్ఛం బూన వీలులేక పండితలోకమునకు జడిసి తప్పో యొప్పో యాయున్నదాని లోనే సవరణ సేయవలసినందులకుఁ గత్తిపై సాము చేయవలెఁ గాని యితరముగాదు. పరిష్కరణ మన్న నింతకష్టము. ఆర్యులారా! క్రొత్తకుండ చేయుకుమ్మరివాండ్రు గలరు గాని ప్రాంతకుండకు మాటువేయు కుమ్మరి యెక్కఁడేని బ్రహ్మసృష్టిలో లేఁడు గదా! బ్రహ్మచేతనే గా దని గూడఁ జెప్పవచ్చును. ఈపరిష్కరణపద్ధతి గూడ నీలాటిదే. పరిష్కరణీయ మగుచోట సొంతముగా నొక్క పద్యము

వ్రాయవలె నన్న నతి సులభము; గాని యాపద్యములోనే తప్పు దిద్ద వలె నన్న దానిం గూర్చిన మనోవ్యథ యనుభవైకవేద్యము. కవి ప్రౌఢుండై యితరకారణములవలన నేవేని యపభ్రంశములు నడుచో వానిని సవరింప వలె నన్న నవలీలయే. మొదలు పెట్టిన దాదిగా రచయితయే యపభ్రంశ ములం బ్రయోగించుచో నిఁక వానిం దిద్దుట యింతంత కష్ట మనరాదు. ఈలాటిబాధ యీగ్రంథములో లే దని చెప్పఁ జాలను. ఏదో భగవదను గ్రహంబుకలిమి నాతోఁచినట్లు సంతరించితిని. చిత్రగింతురుగాత.

పీఠిక 21 వ పద్యములో 'మహితసాహితిశాలి' యనియు 24 వ పద్యములో ఉ. ... ... 'కణాదశాస్త్రయుత సాహితివంతుఁడు' అని యుఁ బ్రయోగము. సాహితీ శబ్దము ఈకారాంతము. ఇకారాంత రూపము మృగ్యము. తత్సమ ము సంస్కృతప్రత్యయములతో సమసింపదు గనుక 'మహితసాహితివాఁడు'...'సాహితినేర్చిన' అను మార్పుతో మంచ మున్నంతలోఁ గాళ్లు సాఁచుకొనవలసి వచ్చినది.

కం. ఇట్లగు... ... మము, బోట్లకుఁ దన్యాభి... పీ. 22. ఇట ట్ల కారప్రాసము. సాదృశ్యార్థబోధక మైనబోఁటిశబ్దము సార్థానుస్వార మై బహువచనమున బోఁట్లు అని యగుచున్నది. అగుచోఁ బ్రాస భంగము దటస్థించుచున్నది. ఇందులకుఁ గొంచెము మార్పుతోఁ బ్రాసము మార్పఁ బడినది. చూడుఁడు పీఠిక.

కం. కామేశ్వరికిని గాళికి, శ్రీమహానందీశనామనృదుఃభాగలసత్ పీ. 30. ఇట 'మహానంది' యని ప్రయోగింపఁబడినది 'ఆన్మహత స్సమా నాధికరణ జాతీయయోః' అనుసూత్రముతో 'మహానంది' అని కావలసి యున్నది గాని మహానంది గాదు. జనసామాన్యముయొక్క వాడుకంబట్టి 'మహానంది మహాదేవశాస్త్రి మహాలయము' మున్నగుశబ్దములు శ్రవణ సుఖముగనే వినఁబడుచున్నను నివి యపశబ్దము లనియె చెప్పవలెఁ గాని యెట్లో సాధింత మని దట్టి గట్టరాదు. ఏందేని యట్టిప్రయోగము లున్నను బ్రమాదపతితము లనుభావముతోఁ గటాక్షింపవలెఁ గాని లక్ష్యము గాఁ జూపరాదు. లక్ష్యముగాఁ జూపినచో, ఆయపభ్రంశములు గూడఁ గొన్నాళ్లకుఁ గవికిఁ బ్రాచీనత్వము గలుగుకొలఁదిని భావికవులకు సుప్ర ప్రయోగభావనయే స్థిరపడి శబ్దతత్త్వమే నశించుట తటస్థించెడిని. ఇదియే శబ్దము—

కం. మంగళకర భణితిఁ దెలిపె మహానందికథల్. ప్ర. 33

సీ. ... మహానంది శివనంది శ్రీసూర్యనంది ప్ర. 143

చ. అలమహానందికన్న ... ... ప్ర. 16

(ఈపద్యములో 'కలమలకాల్వ' అను గ్రామము పే రుండవలసియు మహానందిపదమును సంస్కరింపవలసియుఁ బద్యమే మార్పవలసి వచ్చినది)

సీ. ... మహానందికాంతారమండలాధ్యక్షు లై ...ద్వి. 76

ఉ. ... శ్యామలకోమలాకృతి విశాలమతీ! మహానందిపార్వతీ ! తృ. 1

సీ. తే. ... చేర దేవుఁడు మహానందిసీమ కపుడు. తృ. 43

మ. ...మహానందీశ్వరపూజనావసరసన్మర్ధ్యాహ్నఘంటాధ్వనుల్. తృ. 73

ఉ. ...శ్రీమహానందిలింగపదసీమను ...తృ. 77

ఈయీస్థలములయందుఁ బ్రయోగింపఁబడినది. ఇందులకుఁ గల్పించిన మార్పుల నుదాహరించుటకు గ్రంథవిస్తార మగును గాన నందందుఁ జిత్తగింపఁ గోరుచున్నాఁడ. ఇదియే శబ్దము సుప్తరూపముతోడఁ బ్రయోగించినస్థలములును బెక్కు లున్నవి.

మ. ... ... ... శైవోల్లస

త్సవనారంభుఁడు యోగసిద్ధిమహిమాసంపాదితైశ్వర్యుఁడై. ప్ర. 45

ఇట మహిమన్ శబ్దము 'మహిమా' యని ప్రయోగింపఁబడినది. ఇమనిచ్ ప్రత్యయము నకారాంతమే గాని ఆకారాంతము గానరాదు. కానరాక పోయినను నేదోయొక విధముగ నిట సాధింపవచ్చునే యనుకొందము కాని హఠాదాకృష్టమైన యానిష్పత్తి కవిహృదయమునకు దూర మగుటయే గాక యప్రసిద్ధంబు నయ్యెడిని. కావున శబ్దబ్రహ్మోపాసనాబలమునఁ బౌర్వాపర్యవిమర్శనబుద్ధితో రచయిత శైలి నామూలాగ్రము పరిశీలించి యావల నేమాట యైనం జెప్పవలయుఁ గాని స్థాలీపులాకన్యాయ మీ విషయమునఁ బనికిరాదు. కాన నిట మార్పే యౌచిత్యపోషక మయ్యెడి నని 'మహిమాంచద్దివ్యదైశ్వర్యుఁ డై' అని మార్పఁబడినది.

కం. పంచాగ్ని మధ్యగుండై, చంచల మొకింతలేక చేసెఁ
దపంబున్. ప్ర. 122

చంచల మనుశబ్దము ధర్మి వాచకము గాని ధర్మ వాచకము గాదు. ఇట ధర్మవాచకముగా నుపయోగింపఁబడినది. కాన 'చాంచల్య మొకింత లేక... అని మార్పు.

సీ. ... ... మేధ యొసంగెను మేధావి భారతి...ప్ర. 116

ఇట భారతికి విశేషణము మేధావి యని. ఇది పుంలింగరూపము. భారతికి విశేషణ మగుచో స్త్రీలింగముగా నుండనోపు కాన మేధ యొసంగెను మెఱయంగ భారతి ' యని మార్పక తప్పనిసరి యయ్యె.

కం. పార్థప్రహార భాసుర
తీర్థాలయశిరము ధేను♦తీవ్రఖురాగ్రా
నర్థావహాపఘాతిత
మర్థాత్తుగ నయ్యె నపుడు ♦ హరునకు మిగులన్.

ఇందు ' అర్థాత్తు ' అని సామాన్యముగ మనము వాడుకొనునట్లే గ్రంథము నందుఁ గూడ నుపయోగింపఁబడినది. అర్ధశబ్దమున కిది పంచమీ విభక్తిపైఁ గలిగిన వికారము. ఇట్లే క్రమేణ, బహుశః, అదృష్టవశాత్, వస్తుతః మున్నగు పదములు వాడుట గలదు. కాని యీలాటి వన్నియు నిదే రూపమున గ్రంథముల కెక్కించఁదగినవి మాత్రము గావు. ఇట్లు ప్రయోగించుట భ్రాంతి యనవలె. ఇది యిట్లుండుటంజేసి యిట సంస్కరణ మావశ్యక మగుటఁ బద్యమునకుఁ బద్యమే మార్పవలసి

ఆ. పార్థుచేతఁ దొల్లి ♦ ప్రహరింపఁబడినట్టి
శిరము మరల ధేను♦ఖరఖురాగ్ర
ఘాతితంబు నయ్యెఁ ♦ గర్మంబు చాలక
తగులు ప్రేలు మరలఁ ♦ దగులుఁగాదె? ద్వి. 64

అని యద్దాని కిద్ది చాయ దీయ నాయె.

ద్వితీయాశ్వాసాంతపద్యములో
కర కలిత కృపాణీ కామవిద్వేషరాణీ ... ద్వి. 122

అని యంబిక సంబోధింపఁబడినది. స్త్రీలింగ వాచ్యం బగుచో 'కృపాణినీ'

అని యుండవలసి యుండును. కనుక నిందులకు యథానుకూల్యముగ 'ఖరలస దసిపాణీ' అని మార్పు చేయఁబడక తప్పదుగదా!

చం. ...... ద్రాపల ఫలవృక్షమధ్యమున బ్రహ్మమనోహరతీర్థ మొప్పెడిన్
నడుమన నందితీర్థ మిది నైజముగాఁ బ్రసహించు... ద్వి. 89

ఇట లడలకుఁ బ్రాస మైత్రి చేయఁబడినది. ఆర్యప్రయోగములం దిట్టి ప్రాసము ద్విరూపశబ్దములతోడనే గూర్పఁబడుచుండెడిది. ఇట నట్లు గాదు. లడలకు యతిమైత్రి గూడఁ గూడ దను నార్యవ్యవహారముంబట్టి యిప్పటి కీప్రాసము చింత్యమే.

ఉ. ప్రగ్గడ యూవసంతుఁడు గ ♦ వాతకిశోరము పెన్వజీరుగా. తృ. 19

అని యున్నది. 'ప్రగ్గడ' అనునది పేరు + కడ = ప్రెగ్గడ యనువ్యుత్పత్తితో, ప్రెగ్గడ అని గాని ప్రగ్గడ గాదు. ఇట స్పష్టముగా, ప్రకారమునకే యతి చెల్లింపఁబడినది. వాడుకలో సర్వసాధారణముగ ప్రగ్గడ యని వ్యవహరింపఁ బడుచున్నది. కొందఱట్లే నిరాఘాటముగ వచనములోఁ బ్రయోగించుచున్నారు. ప్రాచీనప్రయోగములలో ప్రగ్గడ అని నిర్ధారించుటకుఁ దగినప్రయోగము దొరకలేదు. కనుక నిది యవశ్యము సంస్కరింపఁదగియే యున్నది గదా! కాఁబట్టి

ప్రెగ్గడ యూవసంతుఁడుగఁ ♦ బెద్దవజీరుగ వాతపోతమున్

అని కూర్పక విధి యేమున్నది?

శా. యజ్ఞారాతి తటాకముం దొలసి బహ్వామ్నాయసంకల్ప మా
యాజ్ఞీకల్ నుడువంగఁ గ్రుంకు లిడి యయ్యాతీర్థదేశంబులన్. తృ. 96

ఇట యాజ్ఞీకల్ అనిప్రయోగింపఁబడినది. యజ్ఞసంబంధినో యాజ్ఞికాః అని రూప మయ్యెడు. కావున

శా. ... ... ... సంకల్పముల్
ప్రాజ్ఞుల్ చెప్పుచునుండఁ గ్రుంకు లిడి యయ్యాతీర్థదేశంబులన్.

అని సూక్ష్మములో మోక్ష మనిపింపఁబడినది.

మ. ... ... పటహధ్వానముతోఁ బటీరములతోఁ బౌరోహితశ్రేణితో
చటుదారాసుత బంధువర్గములతో ... ... తృ. 126

ఇట 'పౌరోహిత' యని వేయఁబడినది. ఇది వాడుక పదము. 'పురోధాస్తు పురోహితః' అని నిఘంటువు. ఇయ్యర్థమున 'పౌరోహిత' అనుప్రయోగము చింత్యము. అది దొరకినంతదాఁక

పటహధ్వానముతోఁ బురోహితులతోఁ జాటీరగంధంబుతో

అను మార్పే యుండని తము. మఱియు నిందే 'దారాసుత' అని ప్రయోగింపఁ బడినది. దార శబ్దము పత్నీవాచకమైనను పుంలింగము. 'దారాపుత్రాదులు' అని సర్వసాధారణముగ వాడుదురు. ఆయుపశ్రుతింబట్టియే కాఁబోలు మన కవిగారు భ్రాంతిపడినారు. ఇట కొలఁదిలో వీలగును గనుక వారి చేటు వారికే యుంచి 'భార్యాసుత...' అని దిద్దఁబడినది.

ఉ. మెట్టెలు తాళిబొట్టు నొడమెవ్వడిబియ్యము కుంకుమంబు...త్రి. 133

ఇట 'నొడమెఱ' అనునదేమో తెలిసినది గాదు. ఇది గాక 'వడిబియ్యము' చో ఒడి శబ్దమునకు వడి యని వాడఁబడినది. ఇదియుఁ బ్రమాద పతితము గావచ్చు ననుతలంపుతోను, కుంకుమముతోపాటు పసుపుండవలెఁ గదా! యనియు ముందు సరియైన రూపము దెలిసినపుడు దిద్దుకొనవచ్చుననియు

'మెట్టెలు తాళియుం బసుపు మేలొడిబియ్యము' అని పరిష్కరింపఁబడినది.

ఉ. శ్యామలు వీణసారణులు సారెకు మీటుచుఁ బాడి రాస్వర
గ్రామములందు మూర్ఛనల రంజనతోడుతఁ దానవర్సలన్. త్రి. 150

ఇట తాన శబ్దము సంస్కృతము. వర్స శబ్ద మాంధ్రము. సంస్కృతము తత్సమరూపము నొందక తెలుఁగు శబ్దముతో సమసింపదు. మఱియు వరుస శబ్దమునకు వర్స అనురూపగూడ విచార్యమే. తానశబ్ద మిచట, గానము సేయునప్పటి తన్నకారమనియే యర్థమిచ్చునది గావలెఁ గాని వేఱొకయర్థమున్నను బ్రకృతోపయోగము గాదు. ఈయభిప్రాయముంబట్టి యిప్పటి కిది ప్రమాదముక్రింద లెక్కవేసి దీనిం దిద్దుట యవసరమై యున్నది; గనుక

స్వర, గ్రామములందు మూర్ఛనలఁ గల్గెడుతానపరంపరావళిన్

అని యందము.

శా. ...ధ్యానాసక్తుఁడు పార్వతీపతికి బద్ధాత్యానురాగంబుతో. త్రి.169

ఇట అతి + అనురాగము = అత్యనురాగము అని రూపసౌష్ఠవము. అత్యానురాగ మనుట యవిమర్శమూలము. కావున

... ... పార్వతీపతికి నత్యంతానురాగంబుతో

అని మార్చుట యసందర్భము గాదుగదా!

శా. శ్రాంతుం డై పవళింప శంకరుఁడు సెజ్జన్ ప్రతిష్ఠింపఁగాఁ
బ్రీతిం జేరినఁ జేరి పాన్పిడి గడుం బ్రేమం దదంఘ్రిద్వయిన్

చేతం దాలిచి యొత్తుచుండఁ గని యోషిద్ధా మహానందిలో
ఖ్యాతాగారము గట్టఁగాఁ జనుము విఖ్యాతుండ వౌ దంతిటన్. ద్వి. 85

ఇట ప్రాసమే తప్పినది. ఇది యన్నిటికన్న మహాభ్రాంతి. ఏది కా దన్నను గా దన వచ్చుఁగాని దీనిం గా దని చెప్పుటకు వీలులేదుగదా ? ప్రపంచమే భ్రాంతిమయము. కుమ్మరి సారె వంటిది. అం దుండువారు సారెమీఁదినుండు వలె భ్రాంతులు గాక పోరుగదా ! ఇన్నింటింబట్టి యీయన కవిత్వమునం దవిమృశ్యకత్వదోషమువలనఁ బూర్వనిర్దిష్టాంశము లన్నియుఁ బ్రామాదికము లే యనుట కింకను సందియ ముండదు గదా ! భ్రాంతి గడవంగ శక్యంబె ? బ్రహ్మ కైన. చిత్తగింపుఁడు. వరాహమిహిరుఁడు జ్యోతిశ్శాస్త్రమునం దుద్దండ పండితుఁడు. కవిత్వములోఁ బ్రౌఢుఁడు. అంతవాఁడే బృహజ్జాతకములో

శ్లో. నేషా యోగా జాతకం కామినీనాం
నిర్యాణం స్యా స్నష్టజన్మదృకాణః, ఉపసం. 3

శ్లో. హోరానవాంశప్రతిమం విలగ్నం
లగ్నా ద్రవి ర్యావతి చ దృకాణే. సప్తజా. 7

అను నీరెండుశ్లోకములలో ఋత్వముతోడి దకారము ద్రుకార మనుభ్రాంతితోఁ బూర్వాక్షరమును గురువు చేసి శ్లోకము నడిపినవాఁడు. లేకున్న గణభంగ మగుచున్నది. దృకాణము గాక ద్రుకాణమే యని యందము పో ద్రేక్కాణాదిరూపములకు బాధక మగుటయే గాక యితఁడే మఱి యొకచోట

శ్లో. సౌర శశాంక దివాకరదృష్టే, వాముసకో మకరాంత్యవిలగ్నే,
ధీనవమోదయగై శ్చ దృకాణైః, పాపయుతై రభుజాంఘ్రిశిరాస్స్యాత్
. నిషే కా. 19

అని దృకాణ యనియే ప్రయోగించియుంటఁబట్టి యిది దృకాణ అనియే నిర్ధారణ. కనుక భ్రాంతి యనుల్లంఘ్య మనుట వాస్తవమే. ఇంతదూర మేల వ్రాయవలసి వచ్చిన దన్నఁ బరిష్కృతభాగములు పరిష్కరణీయములే యని పండితలోకమునకుఁ దోఁపఁజేయునిమిత్తమే యని చిత్తగింతురు గాక ప్రాస భంగమైన పై పద్యము

ప్రీతిం జేరఁగఁ జీరి సేద దొలఁగన్ వేయింపుమా సెజ్జ నా
నాతం దట్టు లమర్చి తన్మయతతో నాస్వామిపాదాబ్జముల్
చేతం దాలిచి ... ... ...

అని యింతటిమార్పుతో సవరింపఁబడినది. ఇవి గాక యింకను గొన్ని కవిప్రమాదములు లేకపోలేదు. వాని నన్నిటిని సంస్కరించినవిధానముం దెలుపవలయు నన్న మరలఁ బ్రత్యక్షరము పరిశీలించి చూడవలసి వచ్చును. ఆ భారము జిజ్ఞాసువులైన పాఠకసోదరులు పాల్గొని నన్ను మన్నింతురుగాక. ఇఁక ముద్రణస్ఖాలిత్యము లుండనే యున్నవి. అవి హృదయపుటము నడికించినయుడికింపు పాఠకలోకమునకుఁ దెలిపి యుపోద్ఘాతము పెంపఁ దలంపలేదు. ఈగ్రంథము వికృతిరూపము మాఱి, ప్రకృతిరూపముఁ జెందునప్పటి కెంతేనియు శ్రమ పెట్టిన దని చెప్పుకొనుట సహృదయులకు విశ్వాసము గలిగింపక పోదు. పత్రపరిశోధనముగూడ నేన శ్రద్ధ మెయి నొనరించితిని. చర్మచక్షువులం దాఁటిపోయినవి పోయియుండవచ్చును. వాని నన్నిటిని బునర్ముద్రణ భాగ్య మున్న నప్పుడు సవరణ సేయుదును. గ్రంథపరిష్కరణమునకు నా కిదియే క్రొత్త గాదు. ఇది పదియవది గావచ్చును. కవియే సమక్షమున నున్న నీ నిరూపించిన యంశము లే గావు. మఱికొన్ని విశేషాంశములు సయిత మిదమిత్థ మని చెప్పి మార్పింపఁ గల్గి యుందు నని చెప్ప సాహసించుచున్నాఁడ. ఇంతకుఁ గవిపరోక్షము. కీర్తికాముఁ డైనకవి దుష్ప్రయోగమును దెలిపినపుడు సమక్షములో నొప్పుకొననియట్లు వాదించినను బరోక్షమందుమాత్ర మద్దానిని సవరించుకొనకపోఁడు. నాయనుభవములో నిట్టి వారిని గొందఱను జూచియుందును. పోయినంతదూర మిదే ప్రసంగముతోఁ జద్దియంత యూరుగాయఁ జేయక గుణప్రకరణమునకుఁ బోయి విరమింతము.

ఈకవి కొన్నియెడల మనోహరము లైన పోకడ లే పోయినవాఁడు. జలక్రీడావర్ణనాదులలో మనోహరము లైనవర్ణనలతోఁ గృతార్థుఁ డైనవాఁడు. కొన్నియెడలఁ బూర్వకవులపోకడల ననుగమించినవాఁడు. కాని యన్నిటను గృతార్థుఁ డయ్యె నని చెప్పినఁ జెప్పవచ్చుంగాక పాఠకలోక మామాట మెచ్చదు. కొన్నియెడల సమాసపుష్టి కొన్నిచోట్ల నంత్యానుప్రాసము కొన్ని తావుల శబ్దచిత్రము కొన్నిస్థలముల నర్థచమత్కారము కొన్నిపట్ల భావగాంభీర్యము పొసఁగించుచు వచ్చినవాఁడు. హృదయంగమము లైన

యీతనిపద్యములలోనివి యొండురెండు వినిపించి విసివియున్న పాఠకులను శ్రోత్రపర్వముచేసి యింతటితో విరమించుచున్నాఁడను.

కం. ఉరుజగర్ఝర గిరినిర్ఝర
పరిసర్ఝరులదరులఁ గడు భయపడ వెలసెన్
గురుచంచలగరుదంచల
భరకంచుకిత-చకితతతపతగాంచిత మై. ప్ర. 40

చ. తనరఁగ నందు దివ్యవనితాజనతాఘనతానితాంతయు
క్తస్తనఘటకుంభసంభృతవిసారిపటీరతుషారవాలుకా
ఘనతరఘుంఘుమంఘుమిత గాంగఝుళీలహరీపరీతమున్
గనఁగొనె నుత్పలాకరముఁ గాంచనపద్మవిరాజమానమున్. ప్ర. 51

---

నను వక్తృవిశేషనిస్పృహా గుణగృహ్యా వచనే విపశ్చితః.
తేజస్వి నా వధీత మస్తు. మావిద్విషావహై.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఇట్లు
విద్వజ్జన విధేయుఁడు,

కవితాసామ్రాజ్యము.
నంద్యాల.
12—1—28.

కావ్యతీర్థ:
మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి
ప్రధానాంధ్రపండితుఁడు,
మునిసిపల్ హైస్కూలు.



శ్రీరస్తు.

శ్రీ గ ణే శా య న మః.

# శ్రీ మ హా నం ది మా హా త్మ్య ము.

## పీ ఠి క.

శ్రీసీతాసతి సాత్వికోద్గమముచేఁ ♦ బ్రీతిన్ వరింపంగఁ దా
నాసీరధ్వజుముందరన్ హరధను♦ర్జ్యారోపశుల్కార్పణా
త్యాసన్నుం డగురామచంద్రుని మెడన్ ♦ హర్షంబుతో నుంచు నా
నాసూనాంచితహార మిచ్చుత ఘన♦జ్ఞానంబు మాకెల్లెడన్.

క. హితమతి నతు లొనరించెదఁ
బతితజనాఘౌఘతిమిర♦పాటనరతికిన్
జితదనుజతతికి లసదా
యతియుతిపతిగతికి వేంక♦టాచలపతికిన్. 2

ఉ. బాల్యవిచేష్టఁ దండ్రిసిగ♦పైఁ గను లబ్జమృణాళజాల మన్
లౌల్యము నొంది తుండము చ♦లంబునఁ జాఁచి విభీతనాగనై
కల్యజపుత్త్కృతిన్ బెదరి ♦ కంపమునం బరువెత్తి గౌరి వా
త్సల్యముచేత నెత్తికొన ♦ స్తన్యము ద్రావుగణేశుఁ గొల్చెదన్.

. హరిసుతు నెవ్వాఁడు ♦ హరముచే దమియించెఁ
గంటిచేఁ గాల నొ♦క్కంటిచేత
సారంగహరణంబు ♦ సవరించె నెవ్వాఁడు
కరముచేఁ దనదుభీ♦కరముచేత

శశికళాస్ఫురణంబు ♦ సంధించె నెవ్వాఁడు
వింటిచే శిరము లై ♦ దింటిచేత
భూషింపఁబడియె నీ♦భువనమం దెవ్వాఁడు
గుణముచే నిజధను♦ర్గుణముచేత
తే. నయ్యాదంభు మహారంభు ♦ నాస్వయంభు
నవితమునిడింభు సంస్తంభ♦దరివిజృంభుఁ
గుంభసంభవవిస్రంభుఁ ♦ గుటిలశుంభ
శాసనీశుంభపరిరంభు ♦ శంభుఁ దలఁతు. 4

మ. సతి! నీడెందము నన్నెకోరుటనొ దా ♦ సౌవర్ణలింగాకృతిన్
శ్రితవృక్షోరుహకైతవంబున సదా ♦ శ్రీగంధమాల్యార్చనన్
హితవయ్యోగ దెయంచు శంకరుఁడు దన్ ♦ హెచ్చింప
లేనవ్వుతోఁ, జ్యుతచేలాంచల మంది కప్పుకొనునా♦శూలి
ప్రియన్ గొల్చెదన్. 5

సీ. కమలాకరగ్రహా♦కలనము లిరుగడ
నిరుగడ విధృతాబ్జ♦హితకరంబు
నగ్నిశిఖాస్ఫుర♦దాననం బిరువాఁగు
నిరువాఁగులను సోమ♦హితవిధాయి
భోగివరాభోగ♦భూవర్తి యిరువంక
నిరువంకఁ బీతాంశు♦కేత మరయఁ
గామపాలనహిత♦కారకం బిరుశేవ
నిరుశేవఁ జక్రసం♦భరణగరిమ
తే. సింధురాజమనఃప్రియ♦శ్రీ యిరుదెస
నలరఁ బ్రకృతియుఁ బురుషుండు ♦ ననఁగఁ బరగు

సిరియు విష్ణువు మా కెల్ల•సిరుల నొసఁగి
ప్రోతు రొండొరుసామ్యముల్ • రూఢిఁ గలిగి. 6

మ. వరముక్తాళుల నొంది హంసకలస•త్పాదాగ్రమై స్వచ్ఛమై
కరకాంచచ్ఛుకవాక్యరంజితమునై • క్రమప్రవీణాగమ
స్వరమై దీపితపద్మరాగతనువై • సత్యానురక్తిన్ బర
స్వరసామ్యంబులనొప్పువర్ణజనక•బ్రాహ్మిన్ విధిన్ గొల్చెదన్.

సీ. వర్ణితరాఘవు • వల్మీకసంభవు
వారణావతివాసు • వరదు వ్యాసుఁ
గవితామహోద్యాన•ఘనమయూరు మయూరు
దుష్కవిపద్మినీ•తుండి దండిఁ
గాళిదాసకవీంద్రుఁ • గవిమహోదధిచంద్రు
భారవి భారవి • బాణు నిపుణు
నన్నయ నన్నయ•సత్కవిచంద్రుని
శోభనగుణరాజి • సోమయాజి

తే. భీమభాషాభిలాషి యా•భీమకవిని
జాలఁ గొనియాడి కేల్మోడ్చి • సరసు లెన్న
నందికేశ్వరులీల లాం•ధ్రమున నొక్క
కబ్బ మొనరింపఁ బూనితిఁ • గాంక్షతోడ. 8

చ. కుటిలతయే భుజంగముల•గుంపులఁ; గంటకజాల మెన్న కా
కుటజసుమౌఘగంధము నె•కోరి భజించుమదాళి పొందునా?
కిటితతి మెచ్చు కర్దమని•కృష్టపుగుంటల; నిట్లు సత్కవుల్
పటుగుణ మెంత్రు కాకవులు • పాయక చూతురు కావ్య
దోషముల్. 9

వ. అని ఇష్టదేవతాప్రార్థనంబును సుకవిప్రశంసయుం గావించి
నాజన్మసాఫల్యంబు గోరి 'కలౌ సంకీర్త్య దైవతే' మ్మనియెడి
పురాణవచనమ్మున దైవధ్యానంబు సేయ సమకట్టి తొల్లి
పరాశరసూనుం డగు శ్రీవేదవ్యాస భట్టారకుండు పురాణ
రత్నం బగు స్కాందంబున శ్రీశైలఖండంబున సనత్కుమార
సంహితయందు మహానందిమాహాత్మ్యంబు కతిపయాధ్యా
యములచే నభివర్ణించె నయ్యధ్యాయార్థం బాంధ్రభాషా
భిలాషులకు సంతోషకరంబుగాఁ దెనిఁగింపం బూనితి. 10

ఉ. దాశసుతాపరాశరసు♦తత్వముఁ బొందినకావ్యముల్
పేశలచాపలంబునను ♦ బ్రేలుచు నాంధ్రముసేయఁబూనుపె
క్కాశల హాస్యభాజనుఁడ ♦ నౌదునొ! పంగువు పక్షిపుంగవా
వేశితవేగముల్ గడువ ♦ వే పరువెత్తి నగించు వైఖరిన్. 11

తే. ఐన నిది యీశ్వరస్తుతి ♦ యావ్రట సాధు
సుకవిరంజన మగుటను ♦ సుకరముగఁ ద
రింతు నిక్కావ్యవారిధిఁ ♦ బ్రీతిపూర్ణ
పండితహృదంతరం బను♦పడవఁ జేరి. 12

వ. ఇదియుం గాక. 13

తే. చేరి నువ్వులు పువ్వుల♦స్నేహ మలర
నంచదామోదగరిమఁ దా ♦ మందునట్లు
రమణఁ గోపూరుపట్టాభి♦రామనామ
రసికుఁ జేరినయీకృతి ♦ రహి వహించు. 14

వ. అని ఇట్లు కృతనిశ్చయుండ నై. మదీయ వంశానువర్ణనంబు
సేసెద. 15

## కవివంశావళి.

సీ. వేద శాస్త్ర పురాణ ♦ వేదాంత కావ్యాది
గాఢవిద్యలకు బొ♦క్కసము నోసము
కుత్సిత కుహాక ♦ కుటిల దురాచార
కఠినచిత్తులకు వె♦క్కసము నోసము
యాయజూకహితాజ్య♦యజనసంతర్పిత
కామారిముఖదివౌ♦కసము నోసము
వాసుదేవ శివాను♦వాదము లుండుటఁ జేసి
కాలుగుండెకుఁ గర♦కసము నోసము
తే. అర్థిసాత్కృతపక్వపా♦యసము నోసము
హర్మ్యచుంబితసద్విహా♦యసము నోసము
వేంకటేశ్వరకంజాత♦బిసము నోసము
భవ్యశాస్త్రార్థపటలీర♦భసము నోసము. 16

ఉ. ఆపురమందుఁ గాఁపురము ♦ హాయిగఁ జేసిరి విప్రపుంగవుల్
పాపవిదూరు లాదిజన♦పాలసమర్పితవృత్తివంతులై
చూపఱు లెన్నఁగా సతులు ♦ సూక్ష్మమతుల్ సుకుమార
లెంతయుం, గోపవిహీనలై మిగులఁ ♦ గూర్మిని దీనులఁ
బ్రోచుచుండఁగాన్. 17

వ. వారలయందు. 18

క. ఉజ్ఝితదుర్గుణు లన్నా
వజ్ఝలకులభవులు సములు ♦ వనజజుతోఁ వా
క్సజ్ఝరులఁ గెలుతు రిజ్జగ
మజ్ఝషకేతనుని గెలుతు ♦ రందమునందున్. 19

వ. ఈమహావంశంబున. 20

సీ. మాతామహుఁడు మాకు ♦ మహితసాహితివాఁడు
శోభనాగమశాస్త్రి ♦ సుబ్బశాస్త్రి
మాతామహియు మఱమ్మ ♦ మమతతో సాఁకిన
నవగుణనికురంబ ♦ నందమాంబ
దివ్యచిదంబర♦దీక్షితాభిధతోడ
మమత హెచ్చినవాఁడు ♦ మాతులుండు
గురు వుపకర్తయుఁ ♦ గూరిమి గలవాఁడు
శేషయశాస్త్రి మా♦చిన్నమామ

తే. వీరు హారితసగోత్రులు ♦ విమలసుష్టు
వంశభవులును సురపుర ♦ వరనృపాల
కృతసుసన్మానవిభవులు ♦ కీర్తిపరులు
బుధజనంబుల దీనులఁ ♦ బ్రోచువారు. 21

క. ఇట్టికులంబునఁ దిమ్మా
భట్టనఁగా నెగడె సకల♦బాడబవరుఁ డే
పట్టున బహుమాన్యుఁడు నా
యట్టిఁడు పొగడంగఁ దరమె ♦ యాయనగుణముల్ ?. 22

ఉ. ఆయనధర్మపత్ని సుగు♦ణాలయ సాధ్వి నిజాత్మనాథునిం
బాయక సేవఁ జేయుఁ; దమ♦బంధువులన్ ఘనులైనవిప్రులన్
న్యాయముతోడఁ బ్రోచునన♦యంబునుదుర్గనుగొల్చునిర్గతా
సూయతసీతమాంబ తన♦చొచ్చినపుట్టినయిండ్లు పెంచుచున్.

ఉ. వారలయందు ముప్వురము ♦ వాసిగఁ బుట్టితి మందుఁ బెద్ద వి
ద్యారతుఁ డీశ్వరాహ్వయుఁడు ♦ ధన్యతఁ గాంచెను దాను

చిన్నమై, సారకణాదశాస్త్రయుత♦సాహితి నేర్చినసుబ్బ
యాఖ్యుఁడన్, వీరలయందు మధ్యముఁడ♦విశ్రుత శేషయ
నామయుక్తుఁడన్. 24

క. రాఘవదేశికలబ్ధా
మోఘాలంకారశాస్త్ర♦ముఖరితముఖుఁడన్
శ్లాఘితగీర్వాణాంధ్రా
ద్యోఘాయితకావ్యరచన ♦ లూనినవాఁడన్. 25

వ. ఇట్టి నేను. 26

షష్ఠ్యంతములు.

క. చేటీకృతఖేటీదిత
పీటీరసలసితముఖకు ♦ విలసన్మకుటీ
వాటీమణికోటీరుచి
ధాటీచకచకితసర్వ♦దశదిఙ్ముఖకున్. 27

క. మదిరాలసతనులతికా
మృదులాలింగితమనోజ్ఞ♦మృడకును విలస
న్మదమహిషదనుజకంధర
రుధిరానందితపిశాచ♦రుచిరచ్ఛటకున్. 28

క. కుందముకుళాగ్ర దంతకుఁ
జందనపంకానుషంగ♦చర్చితకుచకున్
సుందరమరాళయానకు
వందితసురమానితతికిఁ ♦ బరమాదృతికిన్. 29

క. కామేశ్వరికిని బ్రేమిత
సామోదహృదయరసికమ♦హానందీశ

స్వామికిఁ గరుణామృతరస
భూమికి యోగీంద్రహృదయ♦భూమిస్థితకున్. 30

క. నానావిధకంజాండా
నూనకరండాయమాన♦నూత్నోదరకున్
సానుమదుదరఖనీజ
వ్యానీలచ్ఛవికమణికి ♦ నద్భుతఘృణికిన్. 31

వ. సమర్పితంబుగా నొనర్పం బూనిన శ్రీమహానందిమహిమాభి
వర్ణనం బను సత్ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్లనిన. 32

---

## ప్రథమాశ్వాసము.

—♦ క థా ప్రా రం భ ము . ♦—

క. గంగాతీరతపోవన
సంగతు లగుఋషుల కెలమి ♦ సర్వజ్ఞుం డై
పొంగెడుసనత్సుజాతుఁడు
సాంగముగాఁ దెలిపెఁ దా మ♦హానందికథల్. 33

వ. తత్ప్రకారం బెట్లనిన. 34

సీ. శ్రీరమ్యకైలాస♦శిఖరభాగమునందు
మందారవనమధ్య♦మండపమున
సింహాసనమునందు ♦ సిరు లొప్పఁ గొలువున్న
శంకరుఁ గనుఁగొని ♦ శైలపుత్రి
దేవదేవ ! మహేశ ! ♦ తెలుపవే నవనంది
మండలంబునఁ గల♦మహిమ లెల్ల
క్షేత్రప్రభావంబు ♦ శ్రీగిరిమహిమంబుఁ
దీర్థప్రభావంబుఁ ♦ దేటపడఁగ

ఆ. అనుచు వేఁడ గౌరి ♦ కానందభరితుఁ డై
దేవదేవుఁ డపుడు ♦ తెలిపినట్లు
శౌనకాదు లైన ♦ సంయమివరులకు
సూతుఁ డిట్లు దెలిపె ♦ సూక్ష్మగతుల. 35

వ. మునీంద్రులారా! వినుండు తొల్లి కృతయుగంబున నిర్ధూమ పావకసంకాశుండును గాపోతవృత్తి నవలంబించి శిలలు దినుచుఁ దపంబు సేయుకతంబున శిలాదుం డనుపేరం బరగిన శివభాగవతుం డగునొకఋషివరుచరిత్రంబు వివరించెద దాన నవనందిమండలప్రభావంబు దేటపడు నాకర్ణింపుఁ డని యి ట్లనియె. 36

మ. కలదుగ్రాహి మహోగ్ర ఫూత్కృతిమరు♦త్కాంతార
మధ్యజ్వల, జ్జ్వలనజ్వాల విదగ్ధ వేణుజ ఘటా♦ఘాట్కార
శాతఘ్నకో, జ్జ్వలదుద్ఘోష పరిభ్రమ ప్రవిచల ♦ ద్వ్యా
ఘ్రౌఘ భల్లూక పో, త్రి లులాయాయతహస్తి సంకులము
కా♦దేనాఖ్యశైలం బిలన్. 37

సీ. ఎద్దానిశీర్షం ♦ బహీనమై భువిలోన
వేంకటాచల మన ♦ వెలసియుండు
నెద్దానిపుచ్ఛంబు ♦ హృద్యమై యుర్విలో
శ్రీశైలసంజ్ఞ చే ♦ సిరులఁ దనరు
వేదాచలం బన ♦ వెస గరుడాద్రి నా
నెద్దానిమధ్యమం ♦ బెఱుఁగఁబడును
దేవతాక్షేత్రముల్ ♦ దివ్యతీర్థంబులు
నెద్దానియం దెల్ల ♦ నెనసియుండు

తే. నెద్ది సర్వౌషధీగణా♦వృతము యగుట
సకలసత్వనివాసాతి ♦ సౌఖ్య మగుచు
రత్నఫలపుష్పమూలాది♦రమ్య మగుచు
'నల్లమల' యనఁ దెల్ల మై ♦ నయము గాంచె. 38

వ. అట్టి యప్పర్వతరాజంబు మఱియు రాజరాజనిష్కుటంబున కంటె నెంతయు మిక్కుటం బగుసత్కుటంబులసమితిం దనరుతటంబులఁ గలవనపటలంబులం బొందినచందన పిచుమంద మందార సిందువార చాంపేయ దేవదారు వకుళ వంజుళ నీప రసాల సాల జంబూ జంబీర పనసాశ్వత్థ వట కుటజాద్యనేకతరుషండంబుల నల్లిబిల్లిగ నల్లికొనుమల్లికామతల్లికలమీఁద నల్లసిల్లుమాలతీ మాధవీ యూధంపుటలరుజొంపంబులసందులఁ జిక్కువడి తిరుగుకమ్మతెమ్మెరల చెయిదల సుమంబులనుండి జినిజిని దొఱఁగుమరందధారాపూరంబులు వెల్లువ లై పుష్పాడిదుమారంపుఁదిన్నియలు నిండి మట్టుమీఱి యురవడించి కలియుసెలయేటినీటఁ దోఁగి పొటమరించుద్రాక్షకుళుంగకంబులచెంగటి తెర లనియిరుల కిరవగుద్రాక్షానికాయకాయమానంబుల నుద్గమించు ఫలమంజరుల నెనసి ఫలార్థులై కైవారంబులు సేయుకీరకిశోరవారంబుల మవ్వంపుటెఱకలవలన నుదయించి మించు పిశంగప్రభ లచ్చంపుఁబచ్చిక లని మెసవ గమకించి క్రేళ్లుఱుకుకఁన్నెలేళ్లకడగంటిచూపుగముల నుద్గమించుసిలంపు నిగ్గులంబుదప్రకాండం బనియుఁ దదంతరితజ్యోతిర్లతలు శంపాలత లనియుం దత్పరిసరనానాధాతురోచిస్స్వరూపం బింద్రచాపం బనియును దత్కాలపతయాళుతరుకోరకములు

కరక లనియు నిర్ఝరఘోషంబులు మేఘనిర్ఘోషంబు లనియు నెంచి యాఁగా దనిపన్నిదంబులు పఱచి పఱతెంచి పరికించి యోడినవారిం గేరడంబు లాడుచెంచుమించుఁబోఁడులకరాం చలంబుల నంకించుతడవింట్ల వెలువరించిన శరాసారంబుల నేల రాలుకపిత్థాదిఫలంబుల కొనవడి యహంపూర్వికల వడి గలిగి యడుగులు దడఁబడ బుడబుడం జేరువఁ జేరం బాఱుమునిడింభకప్రకాండంబులపవడంబుడంబు విడంబించు కెంజడలజా లిగురు లని కబళింపం బొంచుపికంబుల సము దంచచ్చంచూదితపంచమాలాపంబులనొప్పి పంచమవేదంబు కరణి భీమార్జునాభిరామం బై రాముకరంబుభాతి బాణా సనాలంకృతం బై స్వర్గంబునుంబోలి సుపర్వవంశాభిరామం బై వైతానవేది ననుకరించి శిఖిశిఖాభాసమానం బై నవర తోత్సవకలితసిద్ధమిథునం బయ్యు ననవరతోత్సవకలితసిద్ధ మిథునం బై వాజిచర్యావిరాజమానకురంగం బయ్యును నవాజిచర్యావిరాజమానకురంగం బై సాధ్యకదంబసుందరం బయ్యు నసాధ్యకదంబసుందరం బై వనీపకానందప్రదం బై ప్రకాశించుచుండు. 39

క. ఉరుజర్ఝరగిరినిర్ఝర
వరసజ్ఝరులదరులఁ గడు భయపడ వెలసెన్
గురుచంచలగరుదంచల
భరకంచుకితచకితతతపతగాంచిత మై. 40

క. సురసాలవాల మగుచును
సురసాలప్రతిమరమ్యసురసాలం బై

సురసాలంకృతు లెన్నఁగ
సురసాలంకార మనఁగ ♦ జూడఁగ నొప్పెన్. 41

వ. అందు. 42

చ. పృథులదరీ విశాల బద♦రీ విధురీకృత శైలనిర్ఝరీ
పథ నిబరీస కైతకశి♦ఖాంగణరంగగ భృంగఝంక్రియా
ప్రథితరవానుసారముగ ♦ రాగము లీనెడుకీచకాళితోఁ
గథితవికస్వరస్వరము ♦ గల్పుచు వీణలఁ బాడి రచ్చరల్. 43

చ. వనవనజాతజాతమృదు♦వాతపరీతనమేరుమాలతీ
ఘనఘనసారసారతరు♦కాంతవిహారజఖేదఖిన్నులై
జనిజనిమంజుమంజరులు ♦ చిల్కుడు తేనియసోన లాని తా
మును మునుగంగ గంగకుఁ బ్ర♦మోదముతోఁ జను
చుంద్రు దేవతల్. 44

క. ఆగిరిపరిసరతరువన
భాగమ్మునఁ దపము సేసి ♦ భవులోకమునన్
బాగుగ వసింపఁ గోరుచు
యోగి శిలాదాఖ్యమౌని ♦ యొయ్యన వచ్చెన్. 45

సీ. పూర్ణచంద్రునిఠీవిఁ ♦ బురుడించి మోమున
భస్మపుండ్రచ్ఛాయ ♦ పరిఢవిల్ల
శిరమునఁ గిసలయాం♦చితవల్లికలభాతి
రహిఁ గెంజడలగుంపు ♦ రమణ నొప్ప
గళమున రుద్రాక్ష♦కమనీయమాలికల్
నాభిదేశమునందు ♦ నటన మాడ
మధ్యభాగమునందు ♦ మహనీయచీరంబు
మర్మరధ్వనితోడ ♦ మలయుచుండఁ

తే. గోల జపమాల కుండిక ♦ కుశపవిత్ర
మజినయజ్ఞోపవీతముల్ ♦ హారిసాంగ
చిత్రవైయాఘ్రచర్మంబు ♦ జిగిఁ దలిర్ప
దుష్టసంసృతి రోసి స♦ద్రమాపభాసి. 46

మ. శివపూజానిరతుండు శాంతుఁడు తప♦శ్చింతాపరుండాత్మభూ
భవసంకాశుఁడు కామలోభకలుష♦ప్రధ్వంసి శైవోల్లస
త్పవనారంభుఁడు యోగసిద్ధిమహిమాం♦చద్దివ్యైశ్వర్యుఁడై
రవితేజుండు శిలాదమౌని వెలసెన్ ♦ రమ్యప్రభావోన్నతిన్.

క. కాదేనపర్వతమున న
ఖేదమతిం దపము సేయఁ ♦ గృతనిశ్చయుఁడై
మోదమున నిట్లు వచ్చు శి
లాదమునిం గాంచి ధర్మ♦లాలితమతి యై. 48

చ. వరగుణ సత్పతివ్రత శు♦భవ్రత సంభృతశీల సత్యసుం
దరమధురాభిభాషిణి యు♦దారదయావతి యాత్మనాథునిన్
దిరముగఁ గొల్చువేడుక మ♦దిన్ జవురింపఁగ నేఁగుదెంచెఁ ద
ద్వరసతి భాను వెంటఁ జను♦బాఢగభస్తియుపోలెభక్తితోన్.

వ. ఇట్లు చనుదెంచి యమ్మునిమిథున మ్మవ్వనమ్మునందపమ్మునకు
శుభ మ్మగుని మ్మొకం డన్వేషించుచుండ. 50

చ. తనరఁగ నందు దివ్యవని♦తాజనతాఘనతానితాంతయు
క్తనఘనకుంభసంభృతవి♦సారిపటీరతుషారవాలుకా
ఘనతరఘుంఘుమంఘుమిత♦గాంగదరీలహరీపరీతముం
గనుఁగొనె నుత్పలాకరముఁ♦గాంచనపద్మవిరాజమానమున్.

ఉ. స్వచ్ఛ మకర్దమంబు శుచి ♦ సజ్జనుచిత్తముభాతి శీతలం
బుచ్ఛవిచంద్రమఃకళల♦నొల్కుహిమాంబువుఁబోలి పాటలీ

గుచ్ఛగళన్మధూళిగతిఁ ♦ గోలఁగ రమ్యము సౌఘషోల్లస
త్పుచ్ఛవికీర్యమాణవర♦పుష్కరపుష్కరణీఝరిం గనెన్.
వ. మఱియు నప్పద్మాకరంబష్టోత్తరశతతీర్థసంకులంబును,నిరంతర జలక్రీడాసమారంభసంభృతంబును, జాంబవంతుని దేహంబు పగిదిఁ బృథురోమజటిలంబును, హరికరంబుభాతి సంభృత చక్రంబును, గర్ణపెంపువడువున బహుభంగభంగురంబును, ధనదాగారంబుతీరున సశంఖమకరకచ్ఛపంబును, గామినీ కరంబుమాడ్కిఁ గంకణాలంకృతంబును, మహారాజధాని పోలిక సదామకరికలితంబును, గగనంబురీతి రాజహంసా లంకృతంబును, బురుషోత్తమువక్షంబుభంగిఁ గమలాలంకృతం బై యుండం జూచి చేరం జని. 53
క. గురుకవులు మీనరాశిని
బరగన్ ద్విజరాజు కర్కిఁ ♦ బడయఁగఁ జూచున్
వరమిథునస్థితి బుధుఁడును
గఱగింపఁగఁ జూచు నందుఁ ♦ గన్యారాశిన్. 54
వ. అని మనమ్మున నగ్గించుచు. 55
ఆ. పరమతీర్థ మైన♦పద్మాకరంబున
జలక మాడి వార్చి ♦ జపము దీర్చి
తీరవటముఁ జేరి ♦ ధృతి శిలాదమహర్షి
వనముఁ జూపి పలికె ♦ వనితతోడ. 56
చ. అరయఁగ సద్విజప్రకర ♦ మాగమశాఖలఁ బొల్చి సన్మహా
త్తరులను గూడి సంశ్రితప♦దక్రమ మేర్పడ సుచ్ఛ్రితప్రియ
స్వరములు పల్కుచోటు లివి ♦ సంభృతకృష్ణమృగావళిస్ఫుర
త్ఖురపుటకుట్టితస్థలులు గోర్కి♦ఫలించెడు నిందు సిద్ధమై. 57

ఉ. ఆసుమనోరసాపహుల ♦ నమ్మలినాత్ముల సాధువంశసం
భాసితరంధ్రముల్ నెమకు♦వారల మూలలయందు నిల్చు పు
ష్పాసవమత్తులం దెగువఁ ♦ జంపెడుకాంచనయుక్తులైననా
నాసహకారులిం పెసఁగు♦నవ్యవనం బిది చూడు ముగ్ధలీ!.

క. కందరములు సుందరములు
మందరనిభనాగకనద♦మందరవంబుల్
కుందసుమస్యందిరసా
నందితమాద్యన్మిళింద♦నదబంధురముల్. 59

చ. మఱియురమాకుమారశర♦మాపరమాద్భుతమాలతీసుమా
కరకరవీరగుంజదళి♦గాననిదానవనంబునన్ రుతం
బరసి రమించు నల్లశుక♦మాపిక మాబక మామయూరమా
దరమునఁ బేయసీపటలిఁ♦దాల్చుచు వే వెనఁ వెంట జంటలన్.

క. శిల లెల్ల శివమయంబులు
జల మెల్లను దీర్థమయ మ♦సామాన్యము గా
నలపూజాసాధనముల
ఫలపుష్పాదులనొసంగుఁ ♦ బాదపవితతుల్. 61

వ. అని యిట్లమ్మునిమిథున మ్మవ్వనమ్ము రామణీయమ్మునకు
మనమ్మున మెచ్చి యందుఁ బ్రాగుత్తరప్రవణ మ్మగు నొక
నెలవున వాస్తువిధానమ్మున సూత్రన్యాస మ్మమర్చి యాగీ
యదారువుల నొకపర్ణశాలం గావించి వాస్తుహోమంబు
నిర్వర్తించి మూలఫలనీవారాన్నాదుల బలివిధానంబు వెల
యించి శుభముహూర్తంబున. 62

పృథ్వీవృత్తము.

మయూరగళకాహళీరవ మ♦మంద మై పర్వఁగా
నయంబుగ సుపర్వసత్సుషిర♦నాదముల్ మ్రోయఁగాఁ
బ్రియాసహితభృంగగానముల♦రీతు లొప్పారఁగా
వయోధికులు చూడఁగా లతల♦బంతులం దాడఁగా. 63

తే. తతభరద్వాజ శుకముఖ్య♦తైత్తిరీయ
శ్రుతిమనోహరసూక్తుల ♦ శుభము లెసఁగఁ
బరమహంసలు దమ దైన♦పక్షపాత
మునను దముఁ దిలకింపఁగా ♦ మునియుగమ్ము. 64

తే. ఆజ్యహోమంబు సేసి మం♦త్రాగ్నులందు
శైత్యసౌరభ్యమాంద్యప్ర♦శస్త మగుచు
పీవ వాయువు తీవలు ♦ విరులు గురియఁ
జేరె జడదారి యుటజమ్ముఁ ♦ జెలువు మీఱ. 65

వ. ఇట్లు పర్ణశాలయందుఁ బ్రవేశించి త్రిషవణస్నానంబు సేయుచు బ్రహ్మగాయత్రి జపియించుచు సాయంప్రాతః కాలముల వేల్చి దేవతలం దనుపుచు మూలఫలనీవారాదులం బితృదేవతల నారాధించుచు సమశుచిప్రదేశమ్మునఁ జేలాజినకుశోత్తరంబుగా బద్ధపద్మాసనుం డై యుండి విషయంబులఁ బరిభ్రమించునింద్రియంబుల మనోబలంబున మనంబు బుద్ధిచే, బుద్ధిని క్షేత్రజ్ఞుచే, క్షేత్రజ్ఞుం బరంబుచే నియమించి ప్రాణసంయమనంబు సేసి న్యాసపూర్వకంబుగా బ్రణవయుక్తం బగుపంచాక్షరీ మంత్రరాజంబు జపియించుచు హృదయపద్మకోశమధ్యంబునఁ బ్రాదేశమాత్రుండును దేజోమయుండును శుద్ధసత్వస్వరూపుండును జతుర్వింశతి

తత్త్వాధిష్ఠానభూతుండును హిరణ్యశ్మశ్రుకేశుండు నాపాద మస్తకంబును హిరణ్మయుండును విలక్షణుండును సర్వసాక్షి యు నగుమహేశ్వరు నారాధించుచుండె మఱియు. 66

సీ. మిాఁటక వేకువ ♦ మేల్కాంచు మేల్కాని
కొలనిలో విధిరీతి ♦ జలకమాడు
నాడి సంధ్యావంద♦నాదికృత్యంబుల
దేవర్షిపితృగణ♦తృప్తి సలుపు
సలిపి పూజాద్రవ్య♦చయ మొనఁగూరుచు
నొనఁగూర్చి మృల్లింగ♦ము నొగిఁ దీర్చుఁ
దీర్చి రుద్రము చెప్పి ♦ తీర్థాభిషేకంబు
నతిరుద్రసంఖ్యగా ♦ నమరఁ జేయుఁ

తే. జేసి వస్త్రంబు గంధంబు ♦ చిత్రపుష్ప
ధూపదీపోపహారముల్ ♦ దోడ నొసఁగి
కప్పురమ్మున హారతిఁ ♦ గాంతు నిచ్చి
మఱిసి కొనియాడు శంకరు ♦ మునివరుండు. 67

ఉ. ఆనియమంబునామహిమ ♦ మాదృఢమానముచిత్తశుద్ధియా
జ్ఞానము నాప్రవీణత స♦నాతనధర్మము నిగ్రహంబు నా
ధ్యానపటిష్ఠనిష్ఠయును ♦ యోగవిభాగము యోగసిద్ధియుఁ
బూన శిలాదమానిజన♦పూజ్యునకే దగుఁ జూడఁజూడఁగాఁ.

వ. అట్టియెడ నొక్కనాఁడు. 69

మత్తకోకిల.

సత్కరించి శిలాదు భామిని ♦ సంశితవ్రత యిట్లనెఁ
సత్కుమారుఁడు పుట్టఁజాలెడు ♦ సత్తపం బొనరింపు మో

సత్కులప్రభవా! యనన్ విని ♦ సారసాక్షికి సంతసం
బుత్కటింపఁగ నట్లు సేయుట ♦ కూనె మానివరేణ్యుఁడున్.

వ. ఇట్లు పుత్రకామియై తపంబు సేయ సమకట్టి. 71

ఉ. విఘ్నము లేక తా శిశిర♦వేళల శీతల మాజలంబులో
దఘ్నముగాఁగ నిల్చి పర♦దైవతదైవత ముగ్రుఁ డన్మహా
పఘ్నమునందు హృల్లతిక ♦ ప్రాఁకుకొనన్ గదియించి స
త్క్రియా, నిఘ్నుఁడు మానిశేఖరుఁడు ♦ నింపుతపం బొన
రించె నిష్ఠతోన్. 72

ఉ. వేసవిగాడ్పులన్ జదల♦వేఁడిమయూఖము లొప్పఁ జేయుచా
యాసఖునందుఁ జూపు కలిడి ♦ యై దగుచిచ్చులమధ్య
మందు ను, చ్ఛ్వాసము నిల్పి వానతఱి ♦ వానె వాసముఁ
జేసి శైవవి, శ్వాసము చిత్తమం దలర ♦ సంయమి సేసెఁ
దపంబుఁ దాల్మితోన్. 73

వ. ఇ ట్లేకాగ్రచిత్తంబున సన్నిరుద్ధేంద్రియుండై నిరుచ్ఛ్వాస
తపంబు సేయుచుండ ననేకాబ్దంబులు గడచె నంత. 74

పంచచామరము.

శిలాదుఁ డీవిధంబునన్ వ♦సించి శీర్ణపర్ణకా
నిలాదుఁడై తపంబు ఘోర♦నిష్ఠతోడఁ జేయఁగాఁ
గలాదవహ్నియంత్రదీప్ర♦గాఢకాంతియై తపో
బలాధికాగ్ని పుట్టె దేవ♦పఙ్క్తి మొట్టె దీవమై. 75

తే. బ్రహ్మరంధ్రవినిర్గత♦ప్రబలవహ్నిఁ
గ్రాఁగి వేల్పులు మొఱవెట్టి ♦ కంప మొంద
వారిబాధల నుడుపంగఁ ♦ గౌరి శంభుఁ
డరుగుదెంచెను శ్రీనగ♦ప్రాంతమునకు. 76

వ. ఇట్లు వచ్చి. 77

క. పలుమాఱు వేఁడుతపసికిఁ
జెలిమిని వర మీయఁ దలఁచి ♦ శివుఁ డాతనికిం
గెలన నొకపుట్ట యై తా
వెలసె నహో! శివునికరుణ♦విధ మెట్టిదియో. 78

వ. అంత. 79

చ. ఉటజకుటీప్రదేశమున ♦ నూర్ధ్వముఖం బయి రంధ్రయుక్త మై
ఘటఘటితస్వరూపమునఁ ♦ గ్రమమలీమసకాంతిమంత మై
చటులవళక్షపక్షగత♦చంద్రునిపోలికఁ వృద్ధిఁ బొందుచున్
జటినికట ప్రదేశమున ♦ సొరగుసాకువుఁ జూచి మౌనియున్.

చ. ఇది పరమేశకల్పితమొ? ♦ యిందలిరంధ్రసముద్గతప్రభా
విధము గవాక్షరంధ్రపరి♦విస్తృతనిస్తులభానుమత్ప్రభా
విధమగుఁ జూడఁజూడఁ బుర♦భేదనుఁ డిందు వసింపఁబోలునం
చుదితతపఃప్రభావఘనుఁ♦డుమ్మలికంబున దక్కె యుబ్బుచున్.

స్రగ్ధర.
ఈరీతిం జూచుచుండన్ ♦ హిమకరకిరణా♦హీనకుందాభ
రోచిః, పూరంబుల్ నిండి పర్వెన్ ♦ బులకితతనుఁ డై ♦
భూసురుం డుండె నందున్, జేరంగా వచ్చి రంతన్ ♦ శివ
పరిచరులున్ ♦ సిద్ధదిక్పాలకాదుల్, హేరంబాదుల్
మునీంద్రుల్ ♦ హితకనకవిమా♦నేద్ధ్యులై వేడ్కఁ జూడన్.
అచటికిఁ జేర వచ్చెను మ♦హాహిమభూధరకన్య మాతృకా
నిచయవిశేషమాన్య శర♦నిర్జితదానవసైన్య నాశితా
నుచరమునీంద్రదైన్య సుమ♦నోవిభువన్యవదాన్యపాదపా
పచితలతాంతకాంతకచ♦భాసురధన్య విమానమాన్య యై.

వ. అప్పుడు. ౭౪

సీ. ప్రాఁబల్కుతుదలందు ♦ రహించి మించెడు మేటి
బసవనిమూఁపుపైఁ ♦ బరగు రౌతు
నెలపసిపాపని ♦ నెఱిఁ గొప్పఁబువ్వుగా
నరపదిమోముల ♦ నలరుప్రోడ
వలరాజు నెమ్మేని ♦ వడి బూది సేసిన
దంట ముమ్మొనవాలు ♦ దాల్చుదిట్ట
యిఱ్ఱికుఱ్ఱను దాల్చి ♦ యెనసి మఱ్ఱిని బొల్చి
జడదారిపెద్దల ♦ జతలఁ గూడి

తే. కొలువు దీఱినవేలుపు ♦ గొమరు మిగిలి
పాఁపతొడవులఁ దొడిగెడు ♦ బలియుఁ డట్లు
పుట్టలోనుండి చిన్నారి♦బుడుతఁ డగుచు
మునలితపసికిఁ గనుపించె ♦ ముఱి దలిర్ప. ౭౫

వ. ఇట్లు బాలభావంబునఁ గనుపించి యాక్షణంబ వెలువడి కోటిసూర్యప్రభా భాసమానుండును బిశంగరుచిరుచిర కపర్దకలితశశికలాకలాపుండును గంగాలహరీపరీతజటాజూటుండును బరిశుభ్రనాగాభరణుండును హుతవహజ్వాలాభీల నిటలతటఘటితలోచనుండును గజచర్మపరిధానుండును వ్యాఘ్రాజినోత్తరీయాచ్ఛాదితసర్వాంగుండును త్రిశూలఖట్వాంగ డమరుగ చాప బాణ మృగశాబకాలంకృతకరశాఖుండును గరుణాకటాక్షవీక్షాకృతార్థీకృతభక్తపాత్రుండును నగు నప్పరమేశ్వరుండు సాక్షాత్కరించినం గృతార్థీభూతచేతస్కుండై పెన్నిధిం గన్న నిఱుపేదకరణి నుత్సహించుచుఁ బునఃపునస్సాష్టాంగదండప్రణామంబు లాచరించి యానందా

శ్రువులు దొరఁగ నిటలతటఘటితకరపుటుం డై గద్గదస్వరం
బున నమ్మునివరుం డి ట్లని స్తుతించె. 86

క. ఎవ్వఁడు సచరాచరగురుఁ
డెవ్వనిమాయాప్రభావకృత మీలోకం
బెవ్వనిఁ గనలే రార్యులు
నెవ్వఁడు నిరవద్యుఁ డట్టియీశు భజింతున్. 87

దండకము.

శ్రీరమ్యకైలాసశైలాగ్రదేశంబునన్ రమ్యకల్పద్రుమారామమధ్యంబునం గుంద మందార చాంపేయ మాలూరశాఖాసమున్నిద్రసూనావళీలీననానాళికాగానపీనాచ్ఛకుంజంబునన్ రత్ననిర్యత్ప్రభామండలీమండపాస్తీర్ణసింహాసనోదగ్రభాగంబునన్ దక్షదాక్షాయణీదేవియున్ మీరుఁగూర్చుండి నానాపురాణేతిహాసాగమాఖ్యాయికా వేదవేదాన్తవేదాఙ్గవాదంబు వాదించు మీ వేడ్కఁ జూడంగ ఋష్యాదులే తెంచి రౌద్రాదిసూక్తంబులన్ వేడఁగా నారదాదుల్ కలక్వాణవీణానినాదానుసారంబుగా సామగానంబులన్ బాడఁగా దేవతానీకముల్ సిద్ధవిద్యాధరుల్ నాగయక్షాదులుం దండికైవారముల్ సేయఁగా నందు గంధర్వులం గూడి రంభాదు లాడంగ నానాల్గువేదంబులున్ సర్వశాస్త్రంబులున్ పంచభూతంబులున్ బంచతన్మాత్రలున్ జ్ఞానకర్మేంద్రియవ్రాతమున్ సన్మనోబుద్ధిచిత్తాహముల్ జీవుఁ డవ్యక్తమున్ మూర్తిమంతంబు లై కొల్చుచుండంగ నాభృంగియున్ జండియున్ బాణుఁడున్ రావణాదుల్ సదా జైత్రవేత్రంబులం దాల్చి కాఁపుండి సందళ్లు మాన్పంగఁ గొల్వుండు దేవా

మహాయోగిసంఘంబు లేప్రొద్దు నాగ్నేయచక్రాంతరాళస్థని
వారశూకాతిసూక్ష్మాంతరస్థితపీతప్రభాచ్ఛన్నసౌదామినీజా
గ్రదుజ్జ్యోతి వీ వంచు భావించురూపంబును నీవ రుద్రాజ
విష్ణ్వాదులు నీవ యో సర్వసాక్షీ! విరూపాక్ష! విశ్వేశ!
విశ్వాత్మకా! శ్రీభవానీపతీ! తే నమస్తే నమస్తే నమః. 88

వ. అని మఱియును. 89

మ. పురుషోత్తంసుఁడు వేయుదామరల నీ ♦ బూజించునా
దీక్షతోఁ, గర మొప్పం బరిచర్య సేయ నొకస♦త్కంజంబు
లోపింప నా,హరి నేత్రాబ్జము నుంచె దానిఁ గని శ♦ర్వా!
విష్ణుహస్తంబునన్, వరచక్రాకృతిఁ దోఁప నిల్పవె? మహా ♦
వాత్సల్యభావంబునన్. 90

ఉ. మాధవుఁ డబ్జసంభవుఁడు ♦ మానులముందఱ బాసఁ జేసి నీ
పాదశిరంబులం గనెడు♦వా రయి క్రిందను బైనఁ బెక్కులేం
డ్లాడిన వేడ్కఁద్రిమ్మరియు ♦ నోపి కనుంగొన నేరరైరి; యే
నీదుమహానుభావతను ♦ నేర్తునె? యెన్నఁగఁ జంద్రశేఖరా!.

ఉ. కాముకుఁడై పితామహుఁడు ♦ కావర మేర్పడఁ గూఁతుఁ
బట్టినన్, బామరుఁ డంచు వానిఁ దలఁ ♦ బాయఁగఁ ద్రుంచి
మృగీత్వ మొందుగీ, ర్వాణను మింట నిల్పి యిరు♦ప్రక్కల
నీవును బ్రహ్మ చేరి రౌ,ద్రీమృగశీర్షరోహిణుల♦తీరున వెల్గితి
శౌర! మువ్వురున్. 92

చ. ఉదధి మథింప నందుఁ దమ♦యోగిర మచ్చరపింపఁ
గల్పముల్, మొదవును దేజి నేనుఁగును ♦ బుట్టిన వేల్పులు
నూచి మాకు మా, కిది యని కోరఁగా విసము ♦ హెచ్చి

దహింపఁగఁ బాఱువారిఁ ద, త్పదముల నిల్పఁ గోరి విష♦
పానముఁ జేసినసీకు మ్రొక్కెదన్. 93

ఉ. నేల రథంబు, పద్మజుఁడు ♦ నేత, విశాలనిశాకరార్యముల్
గాలులు, శౌరి యమ్ము, ఘన♦కార్ముక మద్రి, మహాబ్ధి
తూణి, నా, గాలయరాజుమౌర్వియు, హ♦యంబులు వేదము
లిట్టితేరునన్, గ్రాలి వినోదలీలఁ ద్రిపు♦రంబులఁ గూల్చినసీకు
మ్రొక్కెదన్. 94

మ. భవబంధంబులఁ జిక్కిపెక్కువగలం ♦ బల్మాఱు జన్మించియే
భవదారాధకభక్తసంగతిని సం♦ప్రాప్తాత్మవిజ్ఞానినై
భవ! ని న్నెన్నఁగఁ బూనినాఁడ నిటు నీ♦పాదాబ్జసేవా
మహోత్సవమున్ బొందినసామనం బొరుల నెం♦చం
బోవునే? శంకరా!. 95

వ. అని యిట్లు సంప్రార్థించుచున్నయప్పరమపవిత్రునకు భక్త
వత్సలుం డగునప్పరమేశ్వరుండు దరహాసితభాసురముఖ
చంద్రచంద్రికాపూరంబులఁ దన్నయనచకోరంబులం దనుపు
చుఁ దత్తపఃప్రభావంబున కచ్చెరువంది శిరఃకంపంబుసేయుచు
మేఘగంభీరమృదుమధురస్వనంబున ని ట్లనియె. 96

శా. ఈశీతాతపవాతవర్షముల నీ ♦ వి ట్లోర్చి వాతాశి వై
యాశాపాశము ద్రెంచి మానసవికా♦రోద్ధత్యముం బాపి మ
మ్మాశంసించుచు నిల్చి ప్రాణముల దే♦హంబందు నె
ట్లూని తో, హా శైవాగ్రణి! మిమ్ముబోంట్లు ధృతిచే ♦
నోడింతు రీద్వంద్వముల్. 97

మ. తిలలం దైలము దారువందు శిఖి పృ♦థ్విన్ మన్ను పాలన్
ఘృతం, బలరుం; దద్గతి నిండి యంతటను మా♦యన్ గాన

రానట్టినఁ, బలవద్జ్ఞానభరంబుకల్మి విబుధుల్ ♦ భావింత్రు, భావింపలే, రలఘుజ్ఞానవిహీను లైనజను లా♦త్మార్థేంద్రియారూఢు లై. 98

క. నీమానసమునఁ గలిగిన
నేమం బగుకామ మెద్ది? ♦ నిజముగ నాకుఁ
ధీమహిత! వేడ్కఁ దెలుపుము
కామంబుల నెల్ల నిత్తు ♦ గౌరవ మొప్పఁ. 99

క. అని వరదుం డాడిన విని
మునిజనముఖ్యుండు ♦ ముకిలియుచుఁ బలికెఁ
వినయము విద్యయు భక్తియు
మనమునఁ బెనఁగొనఁగ మిగుల ♦ మహిమ దలిర్పఁ. 100

మ. మునిముఖ్యాశ్రిత మై మహామహిత మై ♦ మోహాతి దూరంబు నై, ఘనతృష్ణాఖ్యదుప్రదవాదికలుష♦క్రౌర్యాది నిర్ముక్త మై, సనకాదుల్ సురలుఁ వసించుటకు ని♦చ్చఁ గోరుకైలాసమం, దనవద్యాత్మక! మీసమీపమున స♦న్మానసక్తిఁ జేర్పంగదే!. 101

వ. అని యిట్లు సాలోక్య సామీప్యముక్తుల నభ్యర్థించిన. 102

ఉ. పుత్రులు లేనివారలకుఁ ♦ బుణ్యపదం బది యబ్బు టెట్లు? స
త్పుత్రుఁడ వీవు నాకు గణ♦నీయతపోధన! దానఁ జేసి స
త్పుత్రకు నిత్తు నీ కిపుడు ♦ తోయజమిత్రసమాన తేజు నీ
నేత్రమహోత్సవంబుగను♦నీవిదె చెంగటఁజూడు బాలకుఁ

క. అని యొకబాలకుఁ జూపిన
మన మలరఁగ వానిఁ జూచి ♦ మౌనివరుఁడు స

ద్విసయాభిరాముఁడై కొని
ఘనవసంతోత్సాహశుజాలకలితుం డయ్యెన్. 104

వ. తదనంతరంబ భవుండు శిలాదుం జూచి మహాత్మా! నీ పీ
పుత్రునిచేఁ గృతకృత్యుండ వయ్యెదు కైలాసలోకనివాసం
బునం గల్గు నని నిర్దేశించి తమసాన్నిధ్యం బా క్షేత్రంబునఁ
గలుగఁజేసి యమహాత్మునిచే సత్కృతుండై సపరివారంబు
గాఁ గైలాసంబున కరిగె నిట శిలాదుండు. 105

చ. భవకరుణాప్రభావభవు భావభవప్రతిభున్ సుకుంభసం
భవవిభవున్ గభీరకలభాయితయానువిభావసుప్రభా
భవను విభూతిభూషణు శుభక్రమభాజను దేవసన్నుతున్
భవలతికావిభేదనశుభక్రియుఁ బుత్రుని జూచి యుబ్బుచున్.

క. చందురుని దెగడు మో; మర
విందంబులఁ గనవు కనులు; బృందము లగునిం
దిందిరములు కురులు; మహా
నందకరుఁడు గాన నంది నాఁ దగు వీనిన్. 107

వ. అని మఱియు నానందపులకితగాత్రుండై. 108

చ. జలజసమానలోచను విశాలమహోన్నతవక్షు సుందరున్
గలితసువర్ణవర్ణుఁ గలకంఠరవున్ సుకపోలనాసికున్
విలులితదీర్ఘబాహు నరవిందముఖున్ సువినీలకుంతలున్
బలుమఱు ముద్దులాడి పసిబాలుని నెత్తి శిలాదుఁ
డాత్మలోన్. 109

చ. పితరులబాధ మాన్పె విడిపించెను బున్నరకంబు వంగడం
బతివిశదప్రకాశయుత మై వెలయన్ వెలయించె సన్మహా

ఫ్రితఫలభూజ మీతఁ డని ♦ శీర్షము మూర్కొని నాతిచేతికిం
గుతకముతోడ నిచ్చె నటఁ♦గోమలి బాలునిఁ జూచి ప్రీతయై.

చ. కర మనురక్తి వేఁడియుద♦కంబులు వోసి చెఱంగుచేత నా
దరమున నొత్తి దర్భపురి♦తాటను శాఖకయందుఁ జీర నొ
ప్పరుచులఁ గట్టి యుయ్యెలను ♦ భూర్జపు మెత్తని సెజ్జఁ
జేర్చి తా, బిఱబిఱఁ జేరి యూఁచె నతి♦భీమపరాక్రము
నందినందనున్. 111

వ. తదనంతరంబ. 112

మ. జననం బాదిగ జాతకర్మముఖము ♦ ల్చౌలాంతసంస్కారముల్
మునిసంఘంబులఁ గూడి మౌనివరుఁ డా♦ముఖ్యోక్తకాలం
బులన్, మన ముప్పొంగఁగఁ జేసి పుత్రునకు భా♦మా
యుక్తుఁ డై పంచమా, బ్దనవీనోదయమందు ముండనవిధిన్ ♦
వాంఛించెఁ దాఁ జేయఁగన్. 113

వ. ఇట్లు తనపుత్రున కుపనయనంబు సేయం దలంచి తగువారలఁ
బుత్తెంచి పిలిపించునంత వైశంపాయన పైల బోధాయన
కశ్యపాత్రి భరద్వాజ పరాశర నారద వాలఖిల్య గోబిల
జైమిని సుమంత వాత్స్యాయన యాజ్ఞవల్క్య ప్రముఖులు
చనుదెంచి బృహస్పతినిర్దిష్టం బగుశుభముహూర్తంబున.

శా. వేదధ్యానముతోడ మౌనులు గడున్ ♦ వేడ్కన్ గ్రియా
తంత్రముల్, మోదం బందుచుఁ జేయఁగాఁ బితరులన్ ♦
బూజించుచుం గాహ్లీ, నాదంబుల్ దగఁ దత్సుతోపనయ
నాంత♦తం బొప్పఁగాఁ జేసి సం, బాధాన్యూనహితాన్న
పానముల సం♦భావించె న మ్మౌనులన్. 115

సీ. యజ్ఞసూత్రం బిచ్చె ♦ నయ్యెడఁ బరమేష్ఠి
సావిత్రి నొసఁగెను ♦ సవితృఁ డపుడు
పాలాశదండంబు ♦ పరగ సోముం డిచ్చె
నక్షమాలిక యత్రి ♦ యపు డొసంగె
మౌంజి భరద్వాజ♦మౌనీంద్రుఁ డొసఁగెను
గృష్ణాజినం బిచ్చెఁ ♦ గృపను భూమి
మేధ యొసంగెను ♦ మెఱయంగ భారతి
పద్మనాభుం డిచ్చెఁ ♦ బాత్ర మొకటి
ఆ. అక్షయం బటంచు ♦ నంజలిపుటమునఁ
గమలనిలయ పెట్టెఁ ♦ గాంక్ష భిక్ష
మచటిమౌను లంత ♦ నాశీర్వదించిరి
తేజ మొసఁగి రపుడు ♦ దేవవరులు. 116

వ. ఇట్లుపనీతుం డై వ్రతంబు జరపుచు. 117

ఆ. పంచశిఖలు మౌంజి ♦ పాలాశదండంబు
యజ్ఞసూత్ర మజిన ♦ మంబుఘటము
గొడుగు భస్మరేఖ ♦ కుశలును గౌపీన
మమరుముద్దువడుగు ♦ నరసి మౌని. 118

సీ. వినుగెంపు తనసొంపు ♦ వెలయింప నేలపై
గగనభాగము మాని ♦ కదిసెనొక్కొ
యంటఁగూడనివేల్పు♦టనుఁగుచూ లది వేడ్క
నాఱుమోములు మాని ♦ యడరెనొక్కొ
చిక్కిపోవుట మాని ♦ శీలంపుజాబిల్లి
కళలు వెలయ నిట్లు ♦ గలిగెనొక్కొ

తుంటవిల్తుఁడు విరాజి ♦ తొంటిరూపము నొందె
　　భూమి నీబాలుఁడై ♦ పుట్టె నొక్క-
ఆ. యనఁగఁ దేజ మొప్ప ♦ నతిశుచిస్మితుఁడై
కళలు చాల వెలయ ♦ ఘనత మెఱయ
వెలయుపుత్రుఁ జూచి ♦ వేడ్క నుప్పొంగుచు
మది వికాస మొందెఁ ♦ గోదువ దీఱ. 119

సీ. శిక్షితాచారుఁడై ♦ శీలసంపన్నుఁడై
　　పితృభక్తితోడుతఁ ♦ బ్రీతి వేద
వేదాంగశాస్త్రముల్ ♦ వెలయుచతుష్షష్టి
　　తంత్రముల్ నేర్పుతోఁ ♦ దాను జదివె
సూర్యదేవునియందు ♦ సాంపొందుశాఖల
　　నన్నియుఁ దా నేర్చె ♦ నంద మలర
యోగశాస్త్రంబును ♦ యుక్తసాంఖ్యంబును
　　బాశుపతాగమా♦ద్యాశయంబు
తే. నరసి కైలాసవాసంబు♦నాత్మఁ గోరి
తండ్రికిని మ్రొక్కి చనియెను ♦ దపము సేయ
శ్రీనగప్రాంతకాంతార♦సీమ కపుడు
భవుని దా నమ్మి తలఁచుచు ♦ భావమందు. 120

వ. ఇట్లరిగి యం దొకసమశుచిప్రదేశంబున నియమాభిషేకం
బులం బరిశుద్ధుండై నియమితాహారుండై పరమేశ్వరు
నుద్దేశించి ఘోరతపంబు సేయుచుండె నప్పుడు. 121

క. పంచాగ్నిమధ్యగుండై
చాంచల్య మొకింత లేక ♦ చేసెఁ దపంబుల్

మంచుతటి నీట నిలుచుచు
వంచన యొకయింత లేక ♦ వైభవ మెసఁగన్. 122

ఆ. గాలి కెదుట నిలిచి ♦ గాఢాతపమ్మున
వానయందు బట్ట ♦ బయల నిలిచి
వాసిఁ దపముఁ జేసె ♦ వామదేవునిఁ గూర్చి
చిత్తశుద్ధితోడ ♦ శీలఘనుఁడు. 123

తే. పంచవర్ష సహస్రముల్ ♦ పరమనియతిఁ
జంచలింపక విఘ్నంబు ♦ లెంచ కపుడు
పంచవదనునిగూరిచి ♦ పరమనిష్ఠ
మంచితపమును జేసె న♦మ్మౌనివరుఁడు. 124

వ. అట్టియెడ మహేశ్వరుండు స్వగణంబుతోడఁ బ్రత్యక్షు మగు టయు నమ్మౌనివరుండు ప్రణమిల్లి వినుతి సేయుచుండె నంత నవ్వరదుండు వరంబు వేఁడు మనిన భక్తుండు మహాత్మా! యేం వరంబుం గోర నొల్ల నింక నిచ్చటఁ బెక్కేండ్లు తపంబు సేసెద ననిన భవుండును వల్లె యని మగుడి చనియెఁ దద నంతరంబ. 125

శా. పాదాగ్రంబున నేల నూఁది భవునిన్ ♦ భావించుచున్
మౌని యై, నాదంబున్ బఠికించుచున్ నిలిచి యా♦నంద
ప్రవాహంబులో, భేదం బించుక గల్గనీయక సుఖా♦బ్ధిన్
శూలి సర్వాత్మకున్, బాదాత్మ్యంబున నిల్చి కొల్చెను
ద్రయీ♦తాత్పర్యసంవేది యై. 126

వ. ఇట్లుఖండోపాసనాతత్పరుండై సర్వలోకంబులుసంచరించుచు నంది యనియును మహానంది యనియును శ్వేతనంది యని యును బ్రసిద్ధి గాంచి వాలఖిల్యాదులం గూడి మహాప్రభా

వసంపన్ను లై యుండి మహేశ్వరునిత్యసాక్షాత్కారంబు గోరి యుగ్రతపంబు సేయుచున్నంత. 127

ఆ. భవుఁడు వచ్చి నిలిచె ♦ భక్తునిముందర
గిరిజతోడ మొదలి♦గరిమతోడ
నంది భవుని జూచి ♦ నందితస్వాంతుఁ డై
శరణ టంచు వేఁడె ♦ శైవవరుఁడు. 128

సీ. మీఢుష్టమాయ తే ♦ మీనకేతుహరాయ
శాంతాయ ఘోరాయ ♦ శాశ్వతాయ
అగ్రేవధాయ తే ♦ హంసరూపధరాయ
దూరేవధాయ తే ♦ దుర్దమాయ
దండినే శూలినే ♦ దండితారాతయే
ఖట్వాంగపాణయే ♦ కామదాయ
సోమాయ రుద్రాయ ♦ సుందరమూర్తయే
గజచర్మవసనాయ ♦ కాంతిదాయ
తే. నిరుపమానాయ పూర్ణాయ ♦ నిర్మలాయ
భక్తిగమ్యాయ శుద్ధాయ ♦ పండితాయ
యోగిభావ్యాయ నిత్యాయ ♦ యోగదాయ
నమ యనుచు మ్రొక్కి వినుతించె ♦ నాగధరుని. 129

వ. ఇట్లు వేఁడుచున్న నందిం గనుంగొని శంకరుండు సీమనో రథం బెఱిఁగింపు మనినఁ బ్రమోదమానమానసుం డై. 130

శా. శ్రీకైలాసమునందు మీనగరిలో ♦ సేవాసముత్సాహి నై
మీకారుణ్యము గోరుచుం గుశలి నై ♦ మీపాదసంవాహి నై
శోకంబుల్ దిగనాడి శాంతమతి నై ♦ చోద్యంబు లే

గాంచుచుఁ, లోకాధీశ! మనంగఁ జేయుమ! సనఁ • లో
కోత్తరప్రాశ్రితోఁ. 131

వ. అని తనమనోరథం బెఱింగించిన భవుండు భరితాదరుం డై
నీ కిట్టిపదవి యొసంగితి నీకతంబున నీతఁడియగు శిలాదుం
డును బత్నీయుతుం డై కృతకృత్యుం డయ్యె నీపేర నీక్షేత్రం
బు పంచక్రోశంబుమేర నతిపావనం బయ్యె నీవల్మీకంబు
మత్స్వరూపం బగులింగం బీనికుంజంబునఁ భవాని నివసించి
యుండు. 132

తే. సప్తపాతాళసంధుల • సంశ్రయించి
నీటితెరఁగలనడుమను • నిలిచి యుండి
మీఁదిలోకమ్ము లన్నియు • మిగులఁ గాచు
లింగ మది వత్స! యీమూర్తి•లీల గనుము. 133

వ. అని శివలింగప్రభావం బుపన్యసించి యిందెవ్వరేని నిత్యోత్సవ
పక్షోత్సవ మాసోత్సవ వార్షికోత్సవంబులు సేయువారును,
మఱియు శ్రావణ కార్తిక మాఘమాసములయందును, కృత్తి
కాశివయోగమందును, గ్రహణసంక్రమణకాలంబులను, మాస
శివరాత్రి మహాశివరాత్రులయందును, సోమవారములయం
దును, నీపుష్కరిణిలోఁ బంచధారాతీర్థములయందుఁ దోఁగి
మహాభిషేకంబు సేసి బిల్వదళంబులనేని ద్రోణకుసుమంబుల
నేనిగమల కహ్లార కుందకుసుమంబులనేని దీపోత్సవంబులనేని
దశ శత సహస్ర లక్ష కోట్యర్పణనియమంబున మమ్మారా
ధించి మహాదానంబు లిచ్చి దేవర్షి పితృలం దనిపి భూసుర
సంతర్పణంబులను జేసిరేని వార లిహలోకభోగంబుల నెల్ల
ననుభవించి మదావాసం బగుకైలాసంబుం జేరి సాలోక్య

సామీప్య సారూప్య సాయుజ్యముక్తులం గాంతు రని సిద్దేశించి త్రివారంబు శంఖం బొత్తి వైశ్రవణానీతవ్యోమయానం బెక్కి పురుహూతకరవిసారితశ్వేతచ్ఛత్రం బొప్పం జతుర్వేదంబు లాలవట్టంబులు వట్టుకొన గాయత్రీసావిత్రులు కరకంకణఝుణత్కారంబులం జామరలు వీవ నారదుండు సామగానంబు సేయ మరీచిభృగ్వంగిరస్సులు మంత్రోపస్థానంబుల సంస్తవింప భవానితోడం గూడి నందిని నతనితలిదండ్రులతోడ విమానంబునం దుంచుకొని నిజగణపురస్సరుండై కైలాసంబుం జేరె నని సూతుండు శౌనకాదులకుం జెప్పి మఱియు నీక్షేత్రప్రభావంబు భవానీభవులవినోదగోష్ఠిం బ్రవర్తిల్లె నదియు విన్నవించెద గౌరి యొకనాఁడు మీయట్ల నందిమండలప్రభావంబు వినం గోరిన భవుండు పరిసరవర్తి యగు నందిసిం జూపి. 134

చ. ఇతనికి నాశ్రమం బగుట ♦ నిందునిభానన! నందిమండలం
బతిరమణీయమై సురమ♦హామునిపూజకు భాజనం బనన్
వితతజగత్ప్రసిద్ధి గని ♦ వేమక మానసులు సంశ్రయింపఁగా
హృతదురితప్రరోహ మగు♦నీఘనతీర్థముతోడ భాసిలున్.

ఉ. వేత్రము లూని భైరవులు ♦ వేడ్కను బోవగఁ బంచభైరవ
క్షేత్ర మనం బ్రసిద్ధి గని ♦ కేవలమోక్షఫలైకదాయి నై
స్వేత్రముఖామయాపహవి♦శేషపవిత్రమనోజ్ఞతీర్థమై
నేత్రమహోత్సవం బగుచు ♦ నిర్మలనందివనంబు భాసిలున్.

ఆ. నందిమండలమున ♦ నరుఁ డెవ్వఁ డేనియుఁ
దనువు దొఱఁగెనేని ♦ తరణిఁ దూఱి

వెండికొండ నుండు ♦ వేడ్కతో నాతండు
నాసమానుఁ డగుచు ♦ నాగవేణి!. 137

ఆ. కడఁగి శవము గాల్పఁ♦గా నందుఁ దచ్చిర
స్స్ఫుటనంబు గాదు ♦ చోద్యము గను
శిరము లింగ మగును ♦ శివుననుగ్రహముచే
దానఁజేసి మహిమ♦ దైత్యదమన!. 138

క. ప్రళయోదధిమధ్యంబున
జలములలో జగము వొలియ ♦ జాగ్రత్తగ నీ
నిలయంబు నరసి యేలుదు
నలశూలప్రోతముగను ♦ హరివరమధ్యా!. 139

ఆ. ముక్తికాము లగుచు ♦ మునులును సుర సిద్ధ
సాధ్య నాగ యక్ష ♦ సముదయములు
నందిమండలంబు ♦ నైపుణ్యమునఁ గొల్చి
రాత్మలందు మనల ♦ నాశ్రయించి. 140

చ. ఫలములు గా నెఱుంగు మతి♦పావను లానవనందిమండలీ
నిలయములఁ జేరి కొల్చెదువి♦నీతుల కబ్జజలోక మర్కస
న్నిలయము సోముకొంకియును ♦ నీరజనాభునిమందిరంబునా
విలసితలోక మబ్జముఖ! ♦ వేల్పులలోకము లెల్ల నారయన్.

చ గిరిసుత! యే నధీశ్వరుఁడఁ ♦ గేశవుఁ డింతకు నంతరాత్మ మే
మిరువుర మీనగానవసి♦యింతుము తొమ్మదిరూపు లొంది శ్రీ
హరి నవనారసింహు లన ♦ ఖ్యాతుఁడు నే నవనందు లైతి నా
వరనవనందిదేవతల ♦ వైభవ మేర్పడ నీకుఁ దెల్పెదన్.

సీ. ప్రథమనందియు శుభ♦ప్రదనాగనందియు
ఘనవినాయకనంది ♦ గరుడనంది

శ్రీమహానందియు ♦ శివనంది శ్రీసూర్య
నందిభాసురవిష్ణు♦నంది సోమ
నంది యనంగను ♦ నవనందు లివి; వీనిఁ
బాలించు వృద్ధుఁడౌ ♦ బ్రహ్మనంది
సాంపారునందులు ♦ శోభిల్లె నెల్లెడ
నిన్నగంబున వినుఁ ♦ మేణనయన!
తే. యిన్నిమూర్తులు వెలసిన♦హేతువులును
వారివారలమహిమలు ♦ వారి నెలవు
లెల్ల వివరింతు నీమనం ♦ బుల్లసిల్ల
నద్భుతచరిత్ర మిది యగ♦ణ్యంబు సూవె. 143
ఉ. ప్రాథమికాండసృష్టి సుక♦రంబుగఁ జేయఁ గడంగి యప్రజా
నాథుఁడు సృష్టికిన్ వలయు♦నైపుణి నిమ్మని నన్ను వేఁడఁగా
వేధకుఁ గోర్కెలే నొసఁగి ♦ విశ్రుత మప్రథమాఖ్యలింగమం
దేధితకీర్తినై నిలిచి ♦ యేలుచు నుండుదు మూఁడులోకములన్.
ఆ. నాగరాజు నన్ను ♦ నమ్మి ఘోరతపంబు
మున్ను సేయ మెచ్చి ♦ మోద మలర
భూషణముగ నతని ♦ ముదముతోఁ జేకొని
నాగనంది నైతి ♦ నాగయాన!. 145
ఆ. మొదటిపూజ గోరి ♦ మోదకఖాది యగు
నవ్వినాయకుండు ♦ స్వాంతె మలర
నన్నుఁ గూర్చి తపము ♦ నడుప నే వర మిచ్చి
నవవినాయకాఖ్య♦నంది నైతి. 146
మ. హరిసామీప్యము గోరి మున్ను గరుడుం ♦ డధ్యాత్మ
యోగంబునన్, బరిపాటిం దప మాచరించి కొలువన్ ♦

భవ్యానురాగుండ వై, గుఱి వానిం గరుణించి కోరికెలు సే♦
కూఱం బ్రసాదించి నే, గరుడాఖ్యక్ బ్రభవిష్ణునందివసతిక్♦
గైకొంటి సజ్జ్ఞాననా!. 147

సీ. బ్రహ్మకపాలంబు ♦ బలముచేఁ గూల్పంగాఁ
బ్రభాపించె నాయందు ♦ బ్రహ్మహత్య
యప్పాప మొందుట ♦ నైశ్వర్యములు మాసె
నత్యాహితము డాసె ♦ నవని రోసెఁ
గైలాసమును బాసి ♦ కాంత వానినుఁ బాసి
యత్యంత మాగాసి ♦ నడవి డస్సి
యాఁకలిదప్పుల ♦ నలసత్వమును బొంది
దీనాననుండ నై ♦ తిరిగి తిరిగి

తే. పంచకన్యక లొకచోట ♦ మించియుండ
వారిపజ్జన చేరినఁ ♦ బాయుఁ బాప
మనుచుఁ జేరంగ నరిగి యా♦వైదుగురిని
భిక్ష మిడుఁ డంచు నడిగితిఁ ♦ బ్రియముతోడ. 148

వ. అప్పు డక్కన్యకలు సత్వరంబున. 149

చ. పతిహుతహోమశేషమగు♦పాయసమాత్మకరాగ్రభాగభా
గతితరదీర్ఘదర్వికల ♦ నచ్చుపడంగను బెట్టి దిట్ట లై
నతు లొనరింప కాస్యముల ♦ నవ్వుల వేగ మఱల్చి దవ్వుల
న్వెత గదురంగ నిల్చి చను ♦ నీ వని పల్కిరి కన్యకామణుల్.

వ. అప్పు డే నాత్మగతంబున. 151

మ. కరపాత్రంబుల భిక్షముంగదిసి యీ♦కన్యామణుల్ పెట్టరే
ముఱిపెంబుల్ గనుపట్టవేలొకొ? మహా♦మూర్ఖత్వముక్
బొందిరో, మఱి నే దోషి నటంచుఁ గాంచి మమతల్

మాయించి వర్తించిరో, పరికింపం దగు వీరు మానసములన్
♦భావించు తాత్పర్యముల్. 152

వ. అని యిట్లు వితర్కించి వారల నిర్దేశించి. 153

తే. కన్యలార! పతివ్రతా♦మాన్యలార!
కదిసి కరముల నేల భి♦క్షంబు నిడరు?
భిక్ష మిడి యాదరింపక ♦ బేల లిట్లు
కసరి వెస నన్నుఁ బొమ్మనఁ ♦ గత మ దేమి?. 154

వ. మఱియు దవుదవ్వులనుండి దీర్ఘదర్వుల నాకు భిక్షం బిడు
టకుం గతం బే మనిన నక్కన్యక లి ట్లనిరి. 155

తే. అక్షిరోగ మపస్మార ♦ మైదుపాత
కములు కంఠమాతి సహవాస♦కరులఁ బొందు
న నెడుమాటలు వినవొకో? ♦ యాగమములఁ
దడవు సేయక నీ వింకఁ ♦ దరలి పొమ్ము. 156

శా. స్వర్ణస్తేయియు మద్యపాయియు గురు♦స్త్రీగామిసంయోగి
యున్, వర్ణింపంగను బ్రహ్మహంతయు మహా♦పాపాత్ము
లీవీరి నే, వర్ణోత్తంసుఁడు గూడు నట్టిఁడ యగున్♦వాఁడంచు
మే మెల్ల మా, కీర్ణాంహఃకరునిన్ నినున్ గదియ నే♦గ్గే
పొమ్ము పో మ్మావలన్. 157

వ. మహాజనులం గూడుట కిప్పాపం బపనయింపఁదలఁచేని. 158

క. భృతభువనపదనిహతస
త్క్రతుదీక్షితదక్షసవన♦కైలాసవన
వ్రతతినికుంజనికేతన
శ్రితనిష్కృతి వగుము శవర ♦ శితికంఠవరా!. 159

వ. అనుకన్యకలమాటలకు లక్షితుండ నై తత్క్షణంబ వెడలి. 160

తే. అలమహానందికన్న నం♦ద్యాలకన్న
మిన్న యని కలమేత్కువుల్ ♦ విన్నవింప
నదియ యస్మన్నివాసయో♦గ్యం బటంచు
నరిగితిని గలమలకాల్వ♦యనెడుపురికి. 161

చ. అరయఁగ సద్వ్రతంబుల మ♦హత్తరనిష్ఠల బ్రహ్మహత్యఁబో
దఱిమి సుఖింపఁ గోరి యట ♦ దైవతతీర్థమునందు మజ్జనం
బరుదుగఁ జేసి దాన విగ♦తాంహుఁడ నై కడువేడ్కనచ్చటన్
వరశివనందినామమున ♦ వాసము సేసితి శైలనందనా!.

తే. అచటి గృహమేధు లెల్లన ♦ న్నాశ్రయించి
భావ మలరంగఁ బూజలు ♦ భక్తి సలుపు
చతిథిజనములఁ బోషించు ♦ చాశ్రయింప
సిరులు దళుకొత్త శివనంది♦సీమ నుందు. 163

వ. మహానందిప్రభావంబు శిలాదోపాఖ్యానమ్మున మున్నె వివ
రించితి. 164

ఉ. భాస్కరుఁ డత్యుదగ్రఖర♦భానుల నొందఁగఁగోరి యుగ్రతన్
మస్కరిలోకసన్నుత! చ♦మత్క్రియఁ జేయుతపంబుఁ జూచి
యాభాస్కరుఁ గోర్కులిచ్చుచు ది♦వంబున నిల్పి జగంబు
లేలఁగా, భాస్కరనందిలో నిలిచి ♦ బాళి వహించితి శైల
నందనా!. 165

. వ్యాపకుఁ డగునలవిష్ణువు
తాపసిగాఁ గోరి తపము ♦ రూఢిగఁ జేయన్
దీపించి విష్ణుఁ బ్రోచి మ
హాప్రభతో విష్ణునంది♦యందు నిలిచితిన్. 166

క. నా కవతంసము గాఁగను
ప్రాకటముగఁ దపము సేసి ♦ భాసిలుసోముక్
జేకొని శిరమునఁ దాల్చుచుఁ
జేకొంటిని సోమనంది♦చిరతరవసతిన్. 166

చ. నలువయు నన్నుఁ గూర్చి తన♦నైపుణియొప్పఁడనిశ్చలాత్ముఁడై
సులలితభక్తియోగమున ♦ సోలక సత్తప మాచరింప నా
పలుకులనాతిఁజేని సురభ♦ర్తను గాఁ గృపసేసి కాంక్షతో
నిలిచితి బ్రహ్మనంది యన ♦ నిర్మలదేశమునందుఁ బార్వతీ!.

వ. ఇంక నవనంది ప్రదక్షిణ ప్రకారంబెఱింగించెద నాకర్ణింపుము.

ఉ. మోక్షదు బ్రహ్మనందిని ము♦ముక్షుఁడు సాక్షిగఁ జేసి
మౌనినై, యక్షతచిత్తవృత్తిఁ బ్రకా♦మాఖ్యని నందిని
గొల్చి యంతటన్, దక్షత నెల్లనందులకుఁ ♦ దానుప్రదక్షిణ
మాచరించి బి, ల్వాక్షతధూపదీప ప్రము♦ఖార్ఘ్యని వేదన
లీయఁగాఁ దగున్. 169

చ. వరనవనందినాథు లగు♦భాసురమూర్తులదర్శనంబుకై
ఖరకిరణోదయం బొదవఁ♦గాఁ జని భానుఁడు గ్రుంకునంతలోఁ
దిరముగ బ్రహ్మనందిశివుఁ ♦ దీవ్రతఁ జేరి ఫలార్పణంబు మే
లరయఁగఁ జేయఁగావలయు ♦ నన్యము లేమిటికన్ను సేసినన్.

చ. తురగము నెక్కి యొక్కరుఁడు ♦ తోడిజనంబులఁ గూడి
దక్షుఁడై, నిరుపమనందిమండలము ♦ నిష్ఠమెయిన్ వల
గొంచు వచ్చి యు, ప్పురుషుఁడు భూసురత్వమును ♦ బొంది
జనించెను భూమియందు నా, తురగము హంసయై పొడమెఁ♦
దోడనె రాజతశైలపద్మినిన్. 171

క. నవఖండమండితాఖిల
భువనము వలగొన్న ఫలముఁ ♦ బొందుదు రజలా!
నవనందిశివుల నొక్కొ-క
పవలున సేవించినట్టి♦భక్తులు జగతిన్. 172

ఆ. పాపహరము నిత్య♦పావనం బతిసౌఖ్య
దాయకంబు మోక్ష♦దాయకంబు
నాతి! చెప్ప నేల? ♦ నవనందిదర్శన
మందఁజేయు నన్ను ♦ నతిరయమున. 173

క. అని యీవృత్తముఁ బ్రీతిని
ఘనుఁ డగుశంకరుఁడు దాన ♦ గౌరీసతికిన్
వినిపించె ననుచు దీనిన్
మునివరులకు సూతుఁ డపుడు ♦ ముదమునఁ దెలిపెన్. 174

మాలిని.
వరసురభికదంబా♦వాసినీ! శారదాంబా
వరపృథులనితంబా! ♦ భర్గహస్తావలంబా!
కురతికుధరశంబా! ♦ కుంకుమాక్తాస్యబింబా!
వరగుణనికురుంబా! ♦ పార్వతీశ్యామలాంబా!. 175

గద్యము.
ఇది శ్రీసీతారామసేవాహేవాకలసదభినవకవితాప్రవీణ బుధజనవిధేయ శాండిల్యసగోత్రపవిత్ర తిమ్మాభట్టసుధీపుత్ర శేషసూరిప్రణీతం బైన మహానందిమహిమాభివర్ణనంబునందుఁ ప్రథమాశ్వాసము.

---

# శ్రీ మ హా న ం ది మా హా త్మ్య ము.

## ద్వితీయాశ్వాసము.



—♦ నందీశ్వరుఁడు గోక్షీరపానంబు సేయుట. ♦—

శ్రీగళవామాంకతలా
భోగనివాసిని! మునీంద్ర♦పోషిణి! కుచభా
గాగ్రమసృణఘుసృణవతీ!
యోగిజనారాధ్యశీల! ♦ యుమపతిఫాలా!. 1

తే. అవధరింపుము రజతాద్రి ♦ నగజతోడఁ
జంద్రజూటుండు నుడివిన♦చంద మెల్ల
నైమిశారణ్యమునులకు ♦ నయముతోడ
సూతుఁ డిట్లని చెప్పెను ♦ సొంపు మీఱ. 2

క. ప్రియురాల! వినవె నంద్యా
లయ మనునొకపురము జలజ♦లలితతటాకో
చ్ఛ్రయమధికకృతవరుణాలయ
మయుతను కేదార మగు మ♦హానందికడన్. 3

సీ. ఉన్నతద్విగులు బ♦హువ్రీహు లౌర! త
త్పూర్వసత్పురుషచం♦ద్రులును కృతులు
ద్వంద్వసహిష్ణు లై ♦ తద్ధితవృత్తిచే
నవ్యయీభావంబు ♦ నందువారు
మధ్యమపదలోప♦మహిమఁ జెన్నొందిరి
కాంత లావురియందుఁ ♦ గదిసి చూడఁ
గౌముదీవిశదంబు ♦ ఘటితమాగ్రహసంఘు
మాయత్తశాస్త్రిలు ♦ నందు భటులు

తే. ఏకశేషంబు నిత్యంబు ♦ నెన్ను బుధులు
సర్వ మసమర్థ మంచని ♦ సరకు గొనక
పొలిచి; రప్పురమును బోలు♦పురవరంబు
ధరణిఁ గల్గునె? యెందేని ♦ తలఁచి చూడ. 4

ఉ. ఆపుర మేలు నందనస♦మాఖ్యుఁడు రాజవరుండు తృప్తులై
బాపురె! మేలటంచుఁ దనుఁ♦బౌరులు సన్నుతి సేయుచుండఁగా
గోపురమండితాలయుని ♦ గోధ్వజు గవ్యపయోఘృతాదులన్
దీపితభక్తిసంభృతమ♦తిన్ బరితృప్తి యొనర్చు నిష్ఠతోన్. 5

వ. ఆరాజనందనుండు చాతుర్మాస్యసమయంబున మహేశ్వరునకుం గోటిమధుఘటాభిషేకంబు సేయసంకల్పించి మహనీయులగు విద్వజ్జనుల రావించి హరిహరారాధకుం డగుటం జేసి వారలతో ని ట్లనియె. 6

తే. గ్రాహమును గూల్చి గజరాజుఁ ♦ గాచె నతఁడు
మిత్తి దెగటార్చి మునిఁ గాచి ♦ మించె నితఁడు
త్రావె నాతఁడు పూతనా♦స్తనవిషంబు
కాలకూటంబుఁ గబళించెఁ ♦ గాంతు నితఁడు. 7

తే. సుతుని గాఁ గొనె నలువను ♦ జూడ నతఁడు
సూతుఁ గాఁ గొనె నలువను ♦ జూడ నీతఁ
డిరుదెఱంగుల వారిలో ♦ నెక్కు డెవరొ?
తెలియఁ జెప్పుఁడీ బుధులార! ♦ తెలిసి కొలుతు. 8

వ. వీరలతారతమ్యంబు వివరించుట దుర్ఘటం బంటిరేని నా మనోగతంబు వివరించెద 9

చ. జగముల కంతరాత్మ యనఁ ♦ జాలు జనార్దనదేవునందు నా
జగముల కత్యధీశ్వరతఁ ♦ జాలినశంకరునందు నిత్యమున్

విగతవిభేదబుద్ధి నయి ♦ వేడుక మీఱుదు; నట్లు లాటు నే
వెంగులన్ సర్వఁబూనితిని ♦ మీఁగడపాల హరాభిషేకముల్.

వ. అని యిట్లు తెలియం బలికి విధిపూర్వకంబుగ సంకల్పించి మహాజనులం గూడి కోటిదుగ్ధఘటాభిషేకంబు సల్పుచుండ నంతం డట్లుండ. 11

ఉ. వ్రపపరీతగోపవర♦వాసులు గోపకులాఢ్యు లన్వహం
బా ప్రభునాలమంద లన♦యంబు దలిర్పఁగ మేపుచుం డ్రు సం
దీప్రపవిత్రనందివర♦దివ్యవనాంతరసీమ నొంది మా
నిప్రవరానుశాసనవి♦నిర్గతదుష్టమృగాళి గావునన్. 12

సీ. విదియచందురుఁ బోలు♦విధమునఁ గుఱుచ లా
వాఁడికొమ్ములతోడ ♦ వన్నె కెక్కు
నిండుబొక్కనరీతి ♦ నింపారి కన్పట్టు
వలుఁదపొదుఁగుతోడ ♦ వాసి గాంచి
గళకంబళము ముందు ♦ గదలుచు మెఱయంగ
ఖురపుటంబులఁ జాల ♦ కుదురు గల్గి
కపిలవర్ణముతోడఁ ♦ గడు నొప్పనొడలిచేఁ
గాబేర నేత్రాభ♦గరము నొఱసి

తే. సురభికులజాత సుకుమారి ♦ సుందరాంగి
ద్రోణదుఘ సాధ్వి పీనోధ్ని ♦ రుచిరలోమ
వాలచాలనచాలిత♦వన్యమశక
కపిలధేనువు మందలోఁ ♦ గాంచ నొప్పె. 13

క. అక్కపిలదుగ్ధమును గడు
మక్కువతో గొల్ల లెల్ల ♦ మానవపతికిన్

మ్రొక్కి యొసంగుచు రవి యతఁ
డక్కజముగ నీశ్వరునకు ♦ నభిషేకించున్. 14

సీ. అలమహానందిగ♦హనమధ్యసీమను
బచ్చిక మేయు చా♦పాఁడిమొదవు
వల్మీకభాగంబు♦పజ్జకు నేతేర
నం దుండుభర్గుఁ డా♦యావుపాలు
బాలభావంబునఁ ♦ గ్రోలుచునుండు గో
పాలకు లెఱుఁగ రీ♦పాలనయను
లీల; లీలాగునఁ ♦ జాలకాలము పోవ
గోల లాగొల్ల లీ♦గోవుఁ జేరి

ఆ. పిదికి పిదికి పాల♦బిందువు గానక
హేతు విది యటంచు ♦ నెఱుఁగ లేక
డెందమందుఁ గల క♦డిందిమగంటిమి
డింద మిగుల జాలి ♦ నొంది రపుడు. 15

ఉ. పీడొ పిశాచమో పిఱికొ ♦ బిత్తరమో నగుబాటు వాటిలన్
గోడెలఁగూడెనో జడుపొ ♦ కోపము బింక మొదృష్టిదోసమో
పోఁడిమివీడెనో తెవులొ ♦ పొచ్చెము లేనిబుసొంటియావుకీ
పాఁడిదొరంగిపోవుటకు ♦ పాపతియేమొకొ? సూడ దైవమా!.

వ. అని పలువురు పలుతెఱంగులం బలుకుచుఁ జేయునది దోఁపక విచారపడుచుండ వారిలో నొక్కకులముపెద్ద తద్దయుఁ బెద్దఱికంబు వాటించి గొల్లలం గని మీరు మందలకడ నుండుపంద లించు కైన నీజాడఁ జూడ రైతి రేను గన్నంత విన్నవింతు నిప్పట్టులో నొకపట్టి పుట్టి యిట్టట్టు గదలుచు గుట్టు బయలు పఱపక తేవు మాపు నీయావుపాలు గ్రోలు.

క. బెడిదం బగునాపరిశువు
వడిఁ గొని పై నడిచి భయము ♦ పడ కడరెడున
బ్బ్యడుతేఁడు పడుఁగా కని నే
నడఁచితి నా వ్రేటు వడియు ♦ నాబాలకుఁడున్. 18

వ. పాలు గ్రోలుట మానఁడయ్యె నబ్బిడ్డని నడ్డగించు వెర వార
యఁ నేరక చిక్కుపడితి ననిన వల్లవులు విని యుల్లంబులు
దల్లడిల్ల ని ట్లనిరి. 19

ఉ. పుట్టలయందు సన్మునులు ♦ పుట్టరె? పుట్టినవార లెల్లఁ బెన్
గుట్టుగనుండ కక్రియనె ♦ గోలిరె గ్రోవ్రులపాలు చోరులై
పుట్టను బుట్టి రాఘవుని ♦ పుణ్యచరిత్రముఁ జెప్పి యా
దిట్టయు, ధన్యుఁడౌచ్యవన ♦ ధీరుఁడు నిట్టులె మట్టు మీఱిరే.

ఆ. పాలదొంగ యైన ♦ బాలుని బట్టంగ
నెట్టు లగునొ మనకు ♦ నెఱుఁగరాదు
గుట్టు మీఱి వతఁడు ♦ పుట్టలో నుండునా
పుట్టఁ ద్రవ్వకున్నఁ ♦ బోడమఁ డెపుడు. 21

ఉ. పుట్టను ద్రవ్వరా దనిరి ♦ భూసురు; లిప్పని పూనునంత నే
నెట్టవె సర్పఘూత్కృతులు? ♦ నిల్వఁగనిచ్చునె యెట్టివారినిన్
జుట్టు చరించుభూతములు ♦ సొమ్మసిలంగను జేయుఁగాక హా
పట్టఁగరాదు మామొదవు ♦ పాలు గ్రహించెడుపిన్నపాపనిన్.

వ. అని యిట్లు వితర్కించునంత. 23

తే. దట్టి నిలువంగి తలపాఁగ ♦ దాటి జలుఁగు
చల్లడంబును మొలబాఁకు ♦ చాఁదుచుక్క
మొలకమీసలు కొనగాళ్ల ♦ ముచ్చె లొప్ప
రాజభటు లేఁగుదెంచిరి ♦ రాజసమున. 24

క. రాజవరాగ్రణిబంటులు
పూజకుఁ బాల్గొనఁగ వచ్చి ♦ పోడసూపినఁ దా
మోజ సెడి గొల్ల లందఱు
భూజంబులమఱుఁగుఁ జేర ♦ మునుకొని రంతన్. 25

తే. పితికి పాల్గొని యిటురండు ♦ భీలులార!
భీతిపడ నేల? మీకు నా♦భీరులార!
నిన్న మొన్నను రాక మీ ♦ రున్న తేని
పూజ విచ్ఛిన్న మయ్యె న♦పుణ్యులార!. 26

వ. అని యిట్లు పలికెడురాజభటులం జూచి చకితు లగుచు యాదవు లి ట్లనిరి. 27

చ. వినుఁడొకవింత; మామొదల♦బీరములూనకుఁడయ్యలార!యి
వ్వనమునఁ బుట్టలో ధవళ♦భానుఁడు బాలుఁ డొకండుపుట్టినా
కునికటభూమి నీకపిల♦గో స్తనసన్నిహితాత్మవక్త్రుఁడై
కినిసిన మానకుండఁ గల♦క్షీరము లన్నియుఁ ద్రావు నిత్యమున్.

వ. అని యిట్లు వల్లవులు విన్నవించిన నానుడులు మిథ్యాజల్పితంబులు గా భావించి క్రోధస్ఫురితాధరులై భటు లి ట్లనిరి.

ఉ. కల్లతనంబు లేల? కొఱ♦గాములు సేసితి రిట్టి వొప్పఁగా
నొల్లఁడు రాజు కోపనుఁడ♦యోగ్యులదండ్యులఁ జేయుమిమ్మహో!
గొల్లలుగానఁబెన్గొఱవి ♦ గొంచు శిరంబులు గోఁకికొందురో!
చెల్లవు మీదురుక్తులిఁక ♦ ఛీ యిటురండని వారు వెండియున్.

ఉ. నిన్నటివేళనుండి దొర ♦ నీళులు గ్రోలక యారగింపకే
ఖిన్నత నున్నవాఁ డతని♦కిన్ వ్రతభంగము గల్గె నంచుఁ దాఁ
బన్నినపార్వతీరమణ♦భవ్యపయఃకలశాభిషేకసం
పన్నియమంబు భంగమగు♦వైఖరిఁ జూచి భయాకులాత్ముఁడై.

ఉ. గొల్లలు మేలివార లని ♦ గోపసుతత్వముఁ బొందె మాధవుం
డల్లదినంబులం దటుల ♦ నంబుజనాభుఁడు మెచ్చునట్టిమా
వల్లవజాతిపోఁడిమి ముసుఁ♦పం దొరఁకొంటిరొ! చెట్లఁ బుట్టలం
దెల్లఁ జరించుమీ కగునె ♦ యేలికఁ గొల్వఁగఁ గొల్లలంబునన్.

వ. అని యిట్లదలించి పల్కు రాజభటులం గని వల్లవులు పులుల బారిం బడ్డ లేళ్ళచందంబున భయాకులితస్వాంతులై యిట్లనిరి. 33

ఉ. తప్పులు లేవు మావలనఁ ♦ దప్పుము ధర్మసుసూక్ష్మమార్గ; మె
ల్లప్పుడు సాఁకువారల ర♦మాధిపుఁ డం చెద వంచనంబు లే
కొప్పరికింతు మిట్లణఁగి ♦ యుండెడుమమ్ముల మీఱి
మీర ల, ప్పప్ప! వినంగ రాని వని ♦ యారడిఁ బెత్తురె? పెద్ద
మానిసుల్. 34

చ. గొఱియలవంటివార లని ♦ గొల్లల నుల్లస మాడఁ బాడిగో
నరవరుఁ జేరఁగా నరిగి ♦ నైజగుణంబులఁ దెల్పఁ బోదు మో
వరగుణులార! మావలనఁ ♦ బాపము లేదని యొత్తి పల్కు సా
కిరు లలగంగ కాటమ సు♦కీర్తియు భూపతిచంద్రసూర్యులున్.

వ. ఇట్లని. 36

చ. కరమున దోఁటికోల నడి♦కట్టును గంబళి వెంట నంటి పే
పఱచెడుజాగిలంబులును ♦ వంకరకత్తులు పాలదుత్తలున్
దఱుచగు దామెనల్ పలుపుఁ♦ద్రాళ్ళును గ్రాలఁగఁ జల్లడంబులన్
గుఱిగ ధరించి యేఁగి ర ల♦గొల్లలు భూపతిచెంతఁ జేరఁగాన్.

వ. ఇట్లు చేరం జని. 38

ఆ. కోల చంక నిఱికి ♦ కోఁకకొంగులు సాఁచి
దుత్త దామెనలను ♦ గత్తి డించి

దండ మొనరఁ గట్టి ♦ తత్తఱపాటుతో
రాజుతోడ ననిరి ♦ రోజ దక్కఁగ. 39

వ. పలినవారియెదుట నాగడంబులు నడువ నోపమును నోటి గాంఢ్రతనంబున రజ్జు లాడెడునీబంటులవలలఁ బడకు మవ్వారలనిబ్బరంపుబలుకు లబ్బురంపుదబ్బఱలు మేము వారికెట్టెదుట నిలిచి వారిడురాయిడికి నైపనోపము గొల్లలు గొల్లతనంపువెంగలు లని నీయుల్లంబున నిల్పకుము మావలని నేర మిసుమంతయును లేదు స్వరూప విన్నవింతు మవధరింపుము వేకువజాము గుఱు నను దినంబున నీజరభితుంటతనంపుటావు చిట్టు ముట్టు లాడుచు దామెనత్రాళ్ళం ద్రెంచికొని వెంటఁ జని యడ్డపడుమా వేత్రంబుల సరకుగొనక మోటుకులీల లేఁగయందలిమరులుమాని యడ్డమైనమాయాంద్రఁ గోడంద్రు నక్కసెల్లెంద్రు ముదుసళ్ళఁ బిల్లల నెవ్వరినేనిఁ దన మోర నవ్వలికిం ద్రోబ్బుచుం బాఱి మిట్టు పల్లం బనక యెందేనిం జనుచుఁ జెట్టనక పుట్టనక యెద్దియేని దాఁటుచుఁ బులి యనక కాఱుపోతనక దేనినేని పడల్పడఁ దాఁకుచుం దనపొదుఁగున నిరర్గళక్షీరధారాపూరంబులు వెల్లువలై పాఱం బాఱి యద్దేవరపుట్టచేరువం జేరుచుండు నట్టియెడం బల్లెలం గలసంగడికాండ్రం గూడియు మేము సేయునది దోఁపక కాలుసేతు లాడక కన్నుదోయి దెఱచి చూడ నోపక ఆఁరా పగుదు మట్లయ్యు నెట్టకేలకుఁ దెప్పిరిలి పుయిలోడక యప్పుట్టచేరువం జేరి చూడం జూడ. 40

చ. పటపటఁ బుట్ట భేదిలఁగ ♦ బాలుఁ డొకండు శశాంకవర్ణుఁడో
క్కటకటుగుట్కు మంచుఁ గడ♦కంట మముంగనుఁగొంచుఁ

ద్రాప్రఁ బోల్, నిటలవిలోచనుం డతఁడు ♦ నిత్యము నెత్తిన
నుండు పాపరా, తుటుములు వానిఁ జేర నవి ♦ తోడనె
తొప్పను మమ్ము ఘ్రాత్రిక్రియన్. 41

చ. ఒడలను బూది పెంజడల♦నొప్పగువంకరచందమామయున్
గళమున నల్ల నెన్నదుటి♦కంటను జిచ్చు విసంపుఁబోఁపరా
తొడవులు పేరురమ్మునను ♦ దోపఁ జలింపక చిన్నపాపఁ డా
నెడుఁదమయాపుపాలుగడు♦నీటునమానక పూఁటపూఁటనున్.

తే. చిఱుతపులితోలు సింగమై ♦ సేగి సేయు
జడల బుసకొట్టుపాములు ♦ బడలఁ జేయు
నొసటికంటను గలచిచ్చు ♦ పస యడంచు
ముచ్చుఁ జేరఁగ నోప మే ♦ మచ్చు మీఱ. 43

వ. ఇట్లగుటం జేసి బొమ్మగ్రుడ్డుల నన్నింటినిం దనపొట్టయం
దుంచుకొనఁజాలుజగజెట్టియగునాపుట్టం బుట్టినపట్టెం బట్టు
కొనఁజాలము మేము జలజిలం ద్రిప్పి వైచినకఱకుగొడ్డంటి
వ్రేటు దినియు నతండు పాలు గ్రోలుట మానం డయ్యె నిది
కతంబుగా మీర లూనినచాతుర్మాస్యసమయసంకల్పితకో
టిదుగ్ధఘటాభిషేకంబున కుద్యాపనంబు వాటిల్లె నీతప్పిదం
బు మాయం దిడి మాతలఁ ద్రెవ్వనేసెదవేని యేయుము
మన్నించెదవేని మన్నింపు మని యూరకున్న వల్లవుల నూ
రార్చి యిది పరమేశ్వరవిలాసంబు గానోపు నతిచిత్రం బని
తల యూఁచి యూఁచి కొంతతడవు మిన్నకుండి వారలం
జూచి తేపుతేపకడన యేఁ జనుదెంచిచూచెద మీర లరు
గుం డని వారల ననిచి తనయాత్మగతంబున. 44

ఆ. గొల్లవార లిట్టి ♦ గొప్ప వహించిరే
శితిగళుండు వారి♦చెంతఁ జేరి
బాలలీలఁ జూపు♦భాగ్యంబు గాంచిరి
యిట్టిపదవి నాకు ♦ నెట్టు లబ్బు?. 45

ఆ. పిన్ననాఁటనుండి ♦ పేర్కొన్నదైవంబు
గానరాఁడె నాకుఁ ♦ గాచికొన్నఁ
గాననైతినేని ♦ గడువడి నేఁడె నా
యంగ మింగలంబు♦నందుఁ జొనుతు. 46

మత్తకోకిల.

మిత్రిపుట్టను బాలు ద్రావెను♦మిత్తిగొంగను జూచుసం
పూర్తి యాఫల మందఁ గూడునొ ♦ పొందఁ గాదొ
యెఱుంగ నా, కార్తికేయునితండ్రిసత్కృప ♦ గల్గు టయ్యది
యెట్లొకో?, కర్త యాపరమేశునాజ్ఞకుఁ ♦ గానె బద్ధుఁడఁ
జూడఁగాఁ. 47

వ. అని యిట్లు చింతాపరవశుం డై పంటవలంతిజేఁడు రేయెల్ల
నొక్కతెఱంగునం గడపి వేకువ యగుటయు. 48

ధ్రువకోకిల.

భటుఁడు పూన్చినమేలిగుఱ్ఱము♦పైని నెక్కి కడంకమైఁ
జిటికలోపలఁ జేరి చూచెను ♦ క్షేత్రనందినివాసముఁ
జటులసారస హంస కుక్కుట ♦ చారునాదవికాసముఁ
వటుకభైరవక్షేత్రపాలిత♦వామలూరువిలాసముఁ. 49

తే. చూచి యప్పుడె గుఱ్ఱముఁ ♦ జొనప కవలఁ
దక్షిణంబున డిగి చెట్ల♦దాపునందు

భటుని గుజ్జముతోడుతఁ ♦ బరగ నిలిపి
పాదచారిగ నరిగె నా♦భక్తిపరుఁడు. 50

వ. ఇట్లరిగి ధరణీశ్వరుండు పరమేశ్వరలీలావిగ్రహసందర్శన
కుతూహలైమానమానసుండై మున్మున్న నిర్వర్తితకాల్య
కృత్యుండై యుండ నెద నిశ్చయించి. 51

క. బెగ్గురులు బెగ్గడిల్లఁగ
నెగ్గని తలపోసి హంస ♦ లెగయఁగ దివికిన్
మొగ్గలఁ గోకము లణఁగఁగ
బుగ్గను జలకంబు లాడ ♦ మునుకొని చొచ్చెన్. 52

తే. పంచదారను బోలెడు♦పంచధార
లందు నియమాభిషేకంబు ♦ నతఁడు దీర్చి
కాల్యకృత్యము లొనరించి ♦ గడియలోనఁ
బుట్ట దర్శించి ప్రణమిల్లె ♦ భూవరుండు. 53

వ. అచటినుండి వెడలి దవుదవ్వుల నిండుజవ్వనంపుఁగావరమ్మున
నఁ బెంటి వెటం ద్రిమ్మరుపందిగున్నలగమనాయాసంబున
నంటఁ గఱంగి చెమ్మగిలి కాళ్ళవెంటం జాఱునామునీటి
మీఁదినురుగుం బోలుగొజ్జంగిచిదుపలవలన జజ్జునం జాఱు
పటికంపుఱాచట్టుమిట్టల నల్లనల్లన నరిగి ఱాతిపువ్వుకమ్మఁద
నమ్మున కిరవు లగుతృణాగ్రాహిణీలంపుఁగుట్టిమస్థలులం జొత్తి
ల్లుమృగనాభిరక్తంబులపొత్తున నత్తమిల్లుమెందుజవాదిపిల్లి
లసుగంధబిందుసందోహంపుఁజొంపులు గడచి యేఢాకుటనం
టులం దూఱి కప్పురంపుమిట్ట లెక్కి యేలకితీవెల నలరు
జొంపంబుచేరువం జేరి ముందర. 54

మధురగతిరగడ.

అంచలమిథునము ♦ లదరిపడంగను
గొంకక కోకపుఁ♦గోదమలు బెదరఁగఁ
గూడినకుక్కుట♦కులములు చెదరఁగ
నెమ్మిలు నిమ్మగు♦నెళవుల కెగయఁగ
శుకములు పికములు ♦ సూక్తులఁ బొగడఁగ
వ్రాలినమ్రాఁకుల♦నైపునఁ జని గనె
వాఁడనిపువ్వుల♦వకుళనికుంజము
మలయుచుఁ దిరిగెడు♦మధుకరపుంజము. 55

ఉ. చంద్రశిలాతలంబు గల♦చందనసంవృత మానికుంజముల్
సాంద్రమధువ్రతాంగనల♦సందడిఁ బొంపిరివోవుదాని స
త్కుందతమాలమాలతుల♦తోరపుఁదావులదానిఁ జేరి సం
క్రందనసన్నిభుండు హరుఁ ♦ గాంచఁగ నెంచె నిగూఢ
మూర్తితోన్. 56

వ. అంతట హరుఁడును. 57

ఆ. పరమయోగిజనులు ♦ భావింపలేనట్టి
తనమనోజ్ఞరూప♦మును మహాత్ముఁ
డైనభక్తునకును ♦ గానుపింపఁగ నున్న
సురభి వచ్చి నిలిచె ♦ సుందరాంగి!. 58

వ. ఇట్లు వచ్చిన. 59

సీ. పర్వచంద్రునినిండు♦పండువెన్నెలభాతి
మేనిడాలడవికి ♦ మెఱుఁగు లిడఁగ
ఫణిహారవేల్లిత♦పటుజటాజూటంబు
వన్నియ శంపల♦వైరి గాఁగ

వినువాఁక వెనుకొని ♦ వెలయుజాబిలికూన
వెల్లనిజిగిమల్లె♦విరుల సీన
గళనిబద్ధం బైన♦కాలకూటచ్ఛాయ
దుగ్ధోదగతవిష్ణుఁ ♦ దొడరుచుండ
తే. నాకుగత మైనగోజాను♦నవ్యమధ్య
సీమఁ జిన్నారిబుడుతఁ డై ♦ శితిగళుండు
పాలు ద్రావెను సంతోష♦భరితుఁ డగుచు
యాగభోజనమున వేడ్క ♦ నలరువాఁడు. 60
ఆ. పాలు ద్రావుచున్న♦బాలునినెమ్మని
దడవి నాఁకుఁ బంచి♦తంబుఁ బోయుఁ
జేఁపు మఱియు మఱియు ♦ స్నిగ్ధాంగ ముపాంగ
నావుపుణ్య మెంత ♦ యనఁగవచ్చు. 61
వ. ఇట్లతిస్నిగ్ధదుగ్ధపిపాసావ్యాసంగుం డగుచర్మోత్తరాసంగుని ముహూర్తమాత్రంబు చూచి రాజనందనుండు తత్సమ్ముఖమ్మునకు రాఁ గోరి నికుజంబు వెలువడి రా నద్దేవుండు వామలూరునిగూఢుండు కానుండునపుడు. 62
ఆ. వెఱచి గోవు ద్రొక్కె ♦ వేదవేద్యుశిరంబు
ఖురపుటంబుతోడ ♦ ఘోరముగను
వామలూరురూప♦భవ్యలింగాకృతి
కయ్యె శీర్ష సుషిర ♦ మంతనుండి. 63
ఆ. పార్థుచేతఁ దొల్లి ♦ ప్రహరింపఁబడినట్టి
శిరము మరల ధేను♦ఖరఖురాగ్ర
ఘాతితంబు నయ్యెఁ ♦ గర్మంబు చాలక
తగులు వ్రేలు మరలఁ ♦ దగులుఁ గాదె. 64

ఆ. దానిఁ జూచి నొచ్చి ♦ తాపంబు నొందుచు
రాజు మిన్నకుండి ♦ రవళి దొఱఁగి
నికటదళకుటీర♦నిలయుఁ డైనందిని
జేరి మ్రొక్కి వినుతిఁ ♦ జేసె నపుడు. 65

వ. నందియు బరమేశ్వరానుగ్రహంబునఁ గైలాసంబుఁ జేరి ప్రమథనాథుం డై ముక్తుం డై భవానీభవులపరిచర్య సేయుచుండి విశేషదినంబులయందు నందిమండలంబు సేవించుచుండువాఁడు గాన దైవయోగంబున రాజానందీశ్వరుం గాంచి.

లయగ్రాహి.
రా జపుషు భక్తజన♦రాజతసురేంద్రవన♦భూజ మగునమ్మ
నికి ♦ రాజిలెడుభక్తిఁ, బూజ లొనరించి గిరి♦రాజతనయేశ
సమ♦తేజ! మునిముఖ్య! సుర♦రాజనుత! నాకుఁ, నిజపు
ఫలాత్మకుని ♦ నైజకరుణామయుసు♦తేజ మవని న్వెలయు♦
నిజనులలో నే, యోజ మెఱయుఁ? దెలియఁ♦గాఁ జెప్ప వే
యనిన ♦ భోజకులసంభవున ♦ కాజటియుఁ బల్కెన్. 67

వ. రాజోత్తమా! మదీయదుష్కరతపంబునం జేసి పరమదయాళుం డైనభగవంతుం డీరమ్యక్షేత్రంబున నిరంతరసాన్నిధ్యంబు ప్రసాదించె నట్టిభగవంతుండు ధ్యానాసక్తు లైన మిముబోంట్లకు బాల తరుణ స్థవిర రూపంబుల లీలాసంగ్రహీతశరీరుం డై దర్శనం బొసంగుచుండు నిర్లేపుండు గాన నాధ్యాత్మికాదిబాధ లప్పురుషు నంటఁజాలవు భగవదపరోక్షదర్శనంబునం జేసి కృతకృత్యుఁడవయితివి మఱియు భవత్కపిలాముగ్ధదుగ్ధాభిషేకప్రాథమికోపభోగి యగునీకాలకంఠుండు ప్రథమనంది యనం బరగునది మొదలీవల్మీకక్షేత్రంబు

తుదిగాఁ బ్రాగపవర్గం బై నందిమండలక్షేత్రం బలరు దీని
యందు నవనందులు గలిగి యుండు రీమూర్తులను సేవించి
కృతార్థుండ వగుము. 68

శా. వల్మీకాలయుఁ బూజఁ జేసి సుఖివై ♦ వాసంబు వేచేరుమా
పల్మాఱుం జనుదెంచుచున్ జనుచునున్ ♦ భావిప్రపూజార్థమై
కల్మిల్ దేవునివంచు నెంచి విజహ♦త్కాముండ వై జ్ఞానివై
కల్మాషప్రపదాన్వవాయతిలకా! ♦ కావింపుమా యత్నముల్.

వ. అని యిట్లు నియుక్తుం డై. 70

క. కాచకటకకటకస్థితి
వాచాలుల విప్రవరులఁ ♦ బాటించి శుభా
లోచనుఁ డిట్లని పలికెను
వాచామోచారసంబు ♦ వారలఁ దనుపన్. 71

క. మీరలు నిత్యము నిచటం
జేరుచు వేదానుయుక్తిఁ ♦ జేయుఁడు పూజల్
మీరలు పనిచినపను పే
మీఱక చేయుచును జేతు ♦ మీపోషణముల్. 72

వ. అని యిట్లు ప్రార్థించి వారల నొడంబఱచి. 73

ఉద్ధతగతివృత్తము.
తపోదరుల రాజు ♦ తా బిలిచి వే
తపోదరపురంబు ♦ దాన మిడి పూఁ
టపూఁట నిట నుండుఁ♦డా యనుచు శై
వపూజ లొనరింపఁ ♦ బంచెఁ గడఁకన్. 74

వ. ఇట్లు నియమించి నిత్యాఖండనైవేద్యాదులకుం దగుపదా
ర్థంబుల నొసంగుచు వీరి నందఱం బోషించుచు మునివరుఁ

డగునందిని గొలుచుచుఁ దనపురంబునకుం బోవుచు వచ్చు
చు శివపూజామహాత్మ్యకుం డైయుండె నిట్లుండ. 75

సీ. పోయత వాల్మీకిఁ ♦ బొంది పూర్వమునందుఁ
గాంచినపుత్రులు ♦ ఘనులు విమల
విజ్ఞాను; లవ్వారి♦విస్తృతకులమందుఁ
బుట్టినరాజన్య♦ముఖ్యు లెల్ల
నామహానందిగ♦హనభూమి కొడయు లై
తపము సేయుశిలాద♦తపసిఁ గొలిచి
భక్తు లై భావంబు ♦ ఫాలాక్షుపయి నుంచి
పార్వతీసత్కృపా ♦ పాత్రు లగుచు

తే. మరగి యాదేవికుంజన♦మ్మార్జనంబు
సేసి నీర్చిల్కి ముగ్గులు ♦ చెలఁగఁ దీర్చి
కుంకుమాదుల ఫలములఁ ♦ గుసుమములను
గూర్చుచుందురు మానికిఁ ♦ గుతుక మెసఁగ. 76

వ. ఈప్రకారంబుగా నవ్వాల్మీకిక్షేత్రజు లివ్వల్మీకక్షేత్రంబునందుఁ
బార్వతీపరిచర్యాపరు లై తత్సమీపంబున. 77

క. బసవనిపురమునఁ బాళెము.
వసతిగఁ గట్టుకొని దాన ♦ వసియించుచు న
లైసల ద్విజులఁ బోషించుచు
బసవనిశౌతును భజించి ♦ బలిసిరి వారల్. 78

ఈరీతి నిరువు రగుదొరలచే సేవింపఁబడిన పార్వతీమహేశ్వ
రభాగంబులు గలిగి యప్పుణ్యక్షేత్రం బతిరమణీయం బయ్యె
నింతవట్టు దెలిపితి నింక దేవాలయనిర్మాణప్రకారం బెఱింగిం
చెద నాకర్ణింపుఁ డని సూతుండు శౌనకాదుల కిట్లనియె.

—♦ దేవాలయ నిర్మాణ ప్రకారము ♦—

ఉ. వృద్ధుఁ డమోఘసాహసుఁడు ♦ విశ్రుతమంత్రమహౌషధక్రియా
సిద్ధుఁ డొకండు చారుతర ♦ సింధురసారుఁడు ధీరుఁ డారసా
సిద్ధుఁడు మోహదూరుఁడు వ ♦ శీకృతచిత్తుఁడు పర్వతోపస
న్నద్ధశరీరుఁ డాహరుని ♦ నమ్మి వసించెను వెండికొండ పై.

సీ. శిఖయందు శిరమందుఁ ♦ జెవులఁ గంఠమునందుఁ
గరముల నురమందుఁ ♦ గటిని జాను
వుల నేకబహుముఖ ♦ భూరిరుద్రాక్షలు
పదునొకం డగువేలు ♦ భక్తిఁ దాల్చి
సర్వాంగసంలిప్త ♦ సారభస్మండును
శార్దూలమార్దవ ♦ చర్మవసనుఁ
డక్షమాలాలంకృ ♦ తాత్మహస్తుండును
జపచలదోష్ఠుండు ♦ జటిలుఁ డగుచు

తే. లింగలంబితగళుఁడు వి ♦ లీనయజ్ఞ
సూత్రధరుఁడును బాదుకా ♦ శోభిపదుఁడు
కుండికాజినదండస ♦ త్కుశకరుఁ డగు
శైవముఖ్యుండు రజతాద్రి ♦ సానువునను. 81

వ. 'శివా త్పరతరం నాస్తి' యనియును 'శివ ఏకో విశిష్య
తే' యనియును శివసర్వోత్తమత్వం బుపపాదించుచునుండ
నొక్కనాఁడు ప్రదోషసమయంబున మహానటునినటనోత్స
వంబు దర్శించుటకై కైలాసాధిత్యకాంతరాళవనమధ్యరంగ
మండపంబు దఱియం జొచ్చె నక్కడ. 82

సీ. వాగ్దేవి వీణియ ♦ వాయించి కొలువంగ
నలువ తాళం బమం♦దముగ వేయ
మార్దంగికత్వంబు ♦ మాధవుం డొగిఁ దాల్ప
వైణవికత్వంబు ♦ వాసవుండు
పూనఁగా శ్రీదేవి ♦ భువనమోహనలీల
గానంబు చిత్రమై♦ఖరుల బాడఁ
గార్త్యతికోద్యమ♦ధౌరేయ మై వేల్పు
పిండు గ్రచ్చఱ నిండి ♦ ప్రీతిఁ గొలువ
తే. జడలు విడివడ హారముల్ ♦ చౌకళింప
మేను చెమరింప మేదిని ♦ మిగుల న్రదువఁ
జటులనటమూర్తి దేవతా♦చక్రవర్తి
నటన మొనరించె శాంకరి ♦ నగుచుఁ జూడ. 83

వ. ఇ ట్లీశ్వరుండు నటనోత్సవంబు సల్పి కొంతప్రొద్దునకుఁ జాలిం
చి దేవతల నందఱం బ్రసాదదృష్టిఁ మన్నించి వారివారి
నివాసంబుల కనిచి యారసాసిద్ధుం గని. 84

శా. ప్రీతిం జేరఁగఁ జీరి సేద దొలఁగఁ ♦ వేయింపుమా సజ్జనా
నాతం డట్టు లమర్చి తన్మయతతో♦నాస్వామిపాదాబ్జముల్
చేతం డాలిచి యొత్తుచుండఁ గని యో♦సిద్ధా! మహానందిలో
ఖ్యాతాగారము గట్టఁగాఁజనుమువి♦ఖ్యాతుండ వౌదంతటన్.

క. అని దేవుఁడు పనిచిన విని
ఘనుఁడు తటాలునను వచ్చి ♦ గగనచరుం డై
కనుఁగొనె నందినివాసము
వనతరుసంవాస మవిత♦వరతాపసమున్. 86

వ. కనుంగొని తనలోన. 87

సీ. ఈదారి సముదార♦కేదారములఁ దూఱు
దారభాగ్యాబ్ధదార♦తతుల నొప్పు
నీసీమ మునిహోమ♦హితధూమరుక్ష్యామ
కుటభూమసుమఘుమం♦ఘుమితవిపిన
మీవంక యకలంక♦హితసంకుమదపంక
సంకులమృగమద♦సౌరభంబు
ఈకోన లీశాన♦హితకనదపదాన
సునిదానసురగాన♦సుందరములు

తే. శివునిపుష్కరిణి మునిసం♦జీవకరణి
ధరణి జాపకమోక్షాప్తి♦ధన్యసరణి
భవుఁ డనుధనంజయునకిది ♦ భాస్వదరణి
క్షేత్ర మిది యంచుఁ బ్రీతుఁడై ♦ చేరి చూచె. 83

చ. వలపల విష్ణుతీర్థ మతి♦వైభవ మేర్పడ నొప్పుచుండు దా
పల ఫలవృక్షమధ్యమున ♦ బ్రహ్మమనోహరతీర్థ మొప్పెడిన్
నడుమునునందితీర్థమిది ♦ నైజముగాఁ బ్రవహించుచుండుట న్నే
నిలయముసర్వసమ్మతము♦నిక్కముసర్వమతస్థులొందుటన్.

మ. మునికన్యాజలకుంభ సేచితమహా♦మూలంబు లీవృక్షముల్
వనవాసవ్రతిహోమధూమనిచయ♦వ్యాసిలశాఖాళులై
జను లారంగను గట్టుపుట్టములచే ♦ సంశుభ్రపార్శ్వంబులై
మనముప్పొంగఁగఁబార్వతీభవులస♦న్మానాన్యకృతిన్బొల్చెడిన్.

సీ. నెమరు వెట్టుచుఁ దమ్మి ♦ నివురుగోవులతోడ
సయ్యాటములు సల్పు ♦ సరసఁ బులులు
నివ్వరియన్నంబు ♦ నెఱియంగ భుజియించుఁ
బిల్లు లెల్కలు చేరి ♦ ప్రీతితోడ

బభ్రుని శ్వాసముల్ ♦ బాగుగాఁ గబళించి
భోగిలోకము తృప్తిఁ ♦ బొంగుచుండు
శ్యేనకపోతముల్ ♦ చెలఁగుచు విహరించు
శ్వాపదంబులు లేళ్ల ♦ సలుపు సఖ్య
తే. మిట్లలమ్మగ శత్రుత్వ ♦ మెఱుఁగకుండ
మైత్రితోడుత మెకములు ♦ మరగి తిరుగు
సకలబుతువులధర్మముల్ ♦ జరగు నెపుడు
నందిగిరిఁ జూడ రజతాద్రి♦చంద మౌర!. 91

సీ. కర్ణయుగ్మముచెంత ♦ ఘంటలు మ్రోయించి
వెలిశబ్దములు దాము ♦ విననివారు
గండకత్తెరలతో ♦ గళములు దీపింప
వీరశైవతి విఙ్ఞ♦వీఁగువారు
ఖట్వాంగములు పూని ♦ కావిజడల్ దాల్చి
కాపాలవృత్తిచేఁ ♦ గ్రాలువారు
నిత్యనైమిత్తిక♦నియమసంపన్నులై
ధర్మముల్ సలిపెడు♦తాపసులును
తే. దరువులను గాళ్ల గీలించి ♦ తలలు క్రిందు
గాఁగ ధూమంబు ద్రావుచుఁ ♦ గఠినతపము
సలుపుపెద్దలు నిండుండి ♦ సాంబశివుని
మదిని గొలిచిరి నిత్యంబు ♦ మహిమ దనర. 92

మ. ఇటకుం వచ్చెను సిద్ధుఁ డంచుఁ గడఁకన్ ♦ హృద్యంబుగా
క్షేత్రభూ, తటభూజంబులు పండ్లఁ దేనియలచే♦తన్ గానుకల్
గూర్చుచున్, విటపాటచ్ఛకవాక్కులం బొగడుచున్ ♦

వేడ్కఁ బ్రసూనార్చనల్, ఘటియించెఁ మహి సాధు
పూజనపరుల్ ♦ గారే మనోజ్ఞాగముల్? 93

ఉ. నల్లనికొండ నెత్తముల ♦ నాణెపుఁదీవలపుష్పవాటికల్లో
మల్లెలపాన్పులం దలరి ♦ మారవికారపరీతచిత్తలై
చిల్లునఁ జెంచుగుబ్బెతలు ♦ చెక్కులఁ జిమ్మదివాదివాసనల్
చల్లుచు వీవసాఁగె సుర♦లై వునిమీఁదను గమ్మ తెమ్మెరల్.

వ. అట్టియెడ సిద్ధుండు కాసారావగాహనంబు సేసి నిర్వర్తిత క్రియాకలాపుం డై వల్మీకరూపి యగుభగవంతుం జేరి 'ఓం నమ శ్శివాయ' యని పల్మారు నుడువుచుఁ బ్రణామంబు లాచరించి చతుష్షష్ట్యుపచారంబులఁ బాశుపతాగమవిధానం బున దివ్యపూజ లొనరించి తదనంతరంబ. 95

ఆ. పరశవేదితోడ ♦ భాసిల్లుకలశంబుఁ
గల్పలతయుఁ గరయు♦గమునఁ బూని
'పాహి పాహి' యనుచుఁ ♦ బార్వతీకుంజంబు
పజ్జఁ జేరి యుండెఁ ♦ బావనుండు. 96

ఉ. రాజసుతుండురాజితుఁడు ♦ రాజముఖుండువిరాజమానుఁడా
రాజవతంసుఁ గొల్వ నవ♦రాజితబుద్ధుల విప్రవృద్ధులన్
బూజితవృత్తిఁగూర్చుకొని♦పొంగుచువచ్చిక నేఁ మహాత్మునిన్
భూజమునీడయందుఁ గల♦పుణ్యనిబద్ధ రసాఖ్యసిద్ధునిన్. 97

శా. ఆకారంబున నింగితం బెఱిఁగి యా♦హా! యెంతపుణ్యాత్ముఁడీ
లోకానందకరుండు పావనుఁడు దా ♦ లోకేశ్వరప్రీతిగాఁ
బ్రాకారాదులఁగట్టునో కా! యిచటన్ ♦ భావింపఁగా దేనియా
లోకంబుల్ పరగించియీ నెలవులా♦లోకించుఁ దానేమిటన్?.

క. అని మనమునఁ దలపోయుచు
జనపతి యామునివరేణ్యు♦సరస కరిగి చే
ఘనముదమున నతులొనరిచెఁ
దననామము నుడివి బాష్ప♦ధారలు దొఱఁగన్. 99

తే. లేచి కరసంపుటము చారు♦లీలఁ దాల్చి
వరద! మీనామకలిత మా♦వర్ణవిసర
మరయుచుండెదు నాడెంద ♦ మలరఁ జేయుఁ
డనిన సిద్ధుండు దరహాస ♦ మడర నుడివె. 100

క. వినుము రసాసిద్ధుండను
జనుదెంచితి దేవగృహము ♦ చయ్యనఁ గట్టిం
ప ననన్ ముదమున జనపతి
పనివారలఁ బిలువఁ బనిచెఁ ♦ బరమప్రీతిన్. 101

క. ఖనికుల శిల్పాచార్యుల
ఘనులను గుద్దాలటంక♦కరణధరుల మేల్
పనులందు సమర్థుల నా
జనపతి పిలిపించె నపుడు ♦ చారులచేతన్. 102

చ. అపుడు రసాఖ్యసిద్ధుఁడు మ♦హాజనపూజ్యుఁడు విప్రవృద్ధులన్
నిపుణుల శాస్త్రమార్గపరి♦నిష్ఠుల వేత్తలఁ జూచి కార్యమున్
విపులతరప్రమోదమున ♦ విన్నప మొప్పఁగఁ జేసి తత్కృవ
త్కృప సుముహూర్త మేర్పఱచి ♦ కృత్యములన్ నియమించె
శిల్పులన్. 103

వ. వాస్తుశాస్త్రజ్ఞులు నిరూపించినవిషమాయపరిపాటిం బాటించి.

శా. భేరీ కాహళికా మృదంగ పటహ ♦ ప్రేయోధ్వనుల్ పర్వఁగా
హోరన్ శంఖువుఁ బాజసేసి విధివ♦ద్ధోమంబులన్ వ్రేల్చి స

న్నారీయుక్తుల విప్రులం బిలిచి నా♦నాదానముల్ సేసి తాఁ
బ్రారంభంబున శంకరుం గొలిచి సం♦భావించి నిల్పెన్ వెసన్.

వ. ఇట్లు దేవాలయనిర్మాణకార్యంబు ప్రారంభించి యనుదినంబును సాయంకాలంబునం బనులవా రందఱు పఙ్క్తి దీఱి తమతమచెంగటి సైకతంబు రాశిఁ జేసికొనినం దక్షిణాంబరసాసిద్ధుం డమృతకలశమున నారాసులను స్పృశించి చనుచుండు నప్పుడు. 106

క. చేసినవారికిఁ దమతమ
చేసినపనికొలఁది ఫలము ♦ చేకూరెడు నో
శ్రీసాంబా! యని తలఁచుచు
దోసిలిచే నెమకి చూడ ♦ దొరకును ధనముల్. 107

ఆ. హెచ్చు సేయువారు ♦ హెచ్చుగా ద్రవ్యంబు
తగ్గుసేయువారు ♦ తగుధనంబు
వారివారిపనికి ♦ వలసినమాత్రంబె
ధనము లందుచుండ్రు ♦ తథ్యముగను. 108

సీ. కుద్దాలముఖములఁ ♦ గుప్పించి పాదులు
రహిమించి వేడ్కతోఁ ♦ ద్రవ్వువారు
పొలుపొంద శిలలను ♦ బొందించి జిగిమీఱ
గారచే గోడలఁ ♦ గట్టువారు
బండ్లమీఁదను దెచ్చి ♦ భారంపుశిలలను
దోరంపువేడ్కతోఁ ♦ ద్రోయువారు
ఉలిమొన మెలయించి ♦ యురువైనకంబముల్
పొడవైనదూలంబు ♦ లిడెడువారు

తే. పరశుపాతంబు పరగించి ♦ బలముతోడ
మ్రాఁకులను గొట్టి తీవజొం♦పములు నఱికి
పొదల నురుమాడి పుట్టల♦పొందు చెఱచి
బయలు సేయుచు బలముచేఁ ♦ బ్రబలువారు. 109

వ. ఒండొరులను మీఱుచు. 110

సీ. ప్రాకారమంటప♦ప్రకటమహాద్వార
గోపురచత్వర♦కుట్టిమములు
ముఖమండ పాస్థాన♦ముఖ్యమండప గర్భ
గృహ మధ్యరంగ సం♦గీతశాల
లాగమయాగీయ♦హవనార్థశాలలు
పాఠశాలలు నాట్య♦భవనములును
భాండాలయంబులు ♦ బహుపదార్థము లుంచు
కోష్ఠాగృహంబులు ♦ కొమరు మిగిలి
తే. ఛత్ర చామర డోలికా ♦ శాల లలరఁ
జంద్రశాలలు వాహన♦చయము లుంచు
శాల కల్యాణమండప ♦ జపవిశాల
శాల లలరంగఁ గట్టిరి ♦ చారుగతిని. 111

చ. కృతకమృగేంద్రముల్ కనులఁ♦గిక్కుమెయింగన బెగ్గడిల్లుచు
న్జత గొని పాఱు లేడిగమి♦జానగుబొక్కటి నెత్తు రొల్కు సం
తతము సువాసనాపరిణ♦తం బగుతోరణచారుదేహళీ
చతురకవాటరమ్యమయి ♦ శాంకరగేహము పొల్చె రమ్యమై.

ఉ. ద్వారపుగోపురాగ్రముల♦బంగరుబొమ్మల నిల్పియుండఁగా
వారివిలోచనానిమిష♦భావము గాంచి యమర్త్యభామినుల్

గూరిమిఁ జేరి వారి జత ♦ గూడఁగఁ జీరి సదుత్తరంబు లే
కూరక చూచుచున్న భయ ♦ మొంది వెసంజనిరభ్ర వీథికిన్.

ఉ. గోపుర కాంచన ప్రకట ♦ కుంభము లంబరమందు భాసిలెన్
బాపురె! దక్షయాగమున ♦ భానునిపం డ్లగలించి యంతటన్
గోపముపోక శంకరుఁడు ♦ కుచ్చితు సూర్యునిదున్మి క్రొత్తగా
దీపితసూర్యబింబముల ♦ దేవపదంబున నిల్పెనో! యనన్.

చ. అగరుసువాసనాసురభి ♦ శాద్భుతధూమము వ్యోమమందుస
ద్గగనధునీభృదాకనద ♦ గారసుధాతపకాంతి యన్ మహా
సుగమపయఃపయోనిధిని ♦ సుప్తినిమిత్తము పవ్వళించునా
ఖగపతికేతనుండొ! యనఁ ♦ గానఁగ నాయెను ధీరకోటికిన్.

శా. గాణాపత్యని కేతనంబు మొదలన్ ♦ గల్పించియామీఁదటన్
స్థాణోత్తంభితపార్వతీవిలయమున్ ♦ శోభిల్లఁ బార్శ్వంబునం
గోణంబందున వీరభద్రుగుడిఁ ద ♦ త్కూలంబునన్ భైరవున్
శ్రేణిన్ నిల్పిరి భృంగి చండి గుహులన్ ♦ శ్రేయఃప్రదున్
నందినిన్. 116

వ. ఇట్లు పశ్చిమాభిముఖంబును దక్షిణోత్తరాపరభాగప్రతిష్ఠిత మహాద్వారత్రితయాభిరామంబును దివ్యప్రాకారప్రావృతంబు నగణ్యశిల్పనైపుణ్య వినిర్మిత గోపుర ప్రభా ధవళిత దశ దిశావకాశంబును నానాజన నివాసోచిత మండపాభిరామంబును బుణ్యపుష్కరిణీ రంగదుత్తుంగ తరంగ నట చ్ఛీకర నికర శీతలాయమానంబును జందన పిచుమంద మందార చాంపేయ మాలూర దేవదారు పనసాశ్వత్థ నీపాశోక రసాల సాల తమాల హింతాల తరుచ్ఛాయాచ్ఛాదితంబును మాలతీ మాధవీ మల్లికా వల్లికా వేల్లిత కైతక నికుంజ

మంజుళంబును, దేవపుష్కరిణీ కుల్యాజలప్రవాహసంవర్ధిత కేదారభాగపరిస్ఫుటరాజశాలీక్షు నాగవల్లీ హరిద్రా లికుచ కదళీ నారికేళ దాడిమ తరుషండ శుక పిక శారికా మయూర జలకుక్కుట కోయష్టిక మరాళ కోలాహలంబునుం గా రచించినం జూచి రసాసిద్ధుం డద్దేవాయతనంబు సమ్మార్జితసంసిక్తంబు గావించి శ్రీగంధంబు చిలికించి రతనంపురంగవల్లు లలరించి నవపల్లవతోరణంబు గట్టి చిత్రంబులు చిత్రించి సాంకవ కస్తూరీ కర్పూర కుంకుమ గోరోచనాది సుగంధద్రవ్యంబుల సేకరించి యవ గోధూమ శాలి తండుల ఘృత గుడ తైల హింగూ జీరకాదులు సంపాదించి రంభేక్షుకాండ నారికేళశాఖాశోభితంబు గావించి చలవ చప్పరంబు లమర్పించి మేలుకట్లు గట్టించి కాలాగరుధూపితంబును గర్పూరదీపదీపితంబునుం గావించి మహాజనుల రావించి రాజద్వయసనాథుం డై వృషభధ్వజం బెత్తించి.

సీ. పుణ్యముహూర్తంబు ♦ బోధించి విప్రులు
పుణ్యాహఘోషంబు ♦ బోరు కొలుప
మంగళతూర్యముల్ ♦ మంద్రకాహాళశంఖ
భేరీనినాదముల్ ♦ బిట్టు మ్రోయ
నాగమజ్ఞులు సేరి ♦ హవనంబు లొగిం జేసి
బలివిధానంబులు ♦ పాళి సలిపి
పూర్ణాహుతులు సేసి ♦ పూజనం బొనరించి
నీరాజనంబులు ♦ నిష్ఠ నిచ్చి
తే. విప్రసంతర్పణ మొనర్చి ♦ విభవ మెసంగ
గో సువర్ణ తిలాజ్య భూ♦కోటిం గోటి

పాలులకు నిచ్చి తా మ్రొక్కి ♦ భక్తితోడఁ
జిత్త మలరంగఁ దృప్తుఁ డై ♦ సిద్ధుఁ డవల. 118

వ. విష్ణ్వాద్యఖిలనందిప్రదేశములయందు దేవాలయంబులు గ
ట్టించి తద్దేవతాసంప్రోక్షణంబులు గావించి యచ్చట సేవ
కుల నియోగించి యఖండనైవేద్యాదు లొసంగి రాజాను
మతుం డై యుండె నప్పుడు. 119

క. శిల్పాచార్యులఁ దియ్యని
జల్పితములఁ జేరఁ బిలిచి ♦ చాలఁగ దొడవుల్
పొల్పొందువస్త్రజాత మ
నల్పముగా నిచ్చె సిద్ధుఁ ♦ డధికధనంబుల్. 120

క. అని యీవృత్తముఁ బ్రీతిని
ఘనుఁ డగుశంకరుఁడు సరగ ♦ గౌరీసతికిన్
వినిపించె ననుచు దీనిన్
మునిజనులకు సూతుఁ డట్లు ♦ ముదమునఁ జెప్పెన్. 121

మాలిని.

ఖరలసదసిపాణీ! ♦ కామవిద్వేషురాణీ!
పరిచితశుకవాణీ! ♦ భవ్యచాపేషుతూణీ!
వరనయనజితైణీ! ♦ బాఢవిస్తారశ్రోణీ!
సరసకిసలపాణీ! ♦ చారునాగాభవేణీ!. 122

గద్యము.

ఇది శ్రీసీతారామసేవాహేవాకలసదభినవకవితాప్రవీణ
శాండిల్యసగోత్రపవిత్ర తిమ్మాభట్టసుధీపుత్ర బుధజనవిధేయ
శేషయసూరిప్రణీతం బైనమహానందిమహిమాభివర్ణనం బను
ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

# శ్రీ మహానందిమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము.



ఉ. హైమవతీసతీ! రచిత♦హారపరిష్కృతి! సచ్చమత్కృతీ!
శ్రీమతి! సుప్రతీకగజ♦సేవితదిక్పతిజాతసత్కృతీ!
సోమకళావతీ! నిగమ♦సూక్తివివేచితభానురాకృతీ!
శ్యామలకోమలాకృతి! వి♦శాలమతీ! జితభీతి! పార్వతీ!.

తే. అవధరింపుము సభలలో ♦ నార్యజనులు
సరసగోష్ఠులఁ బలికెడు♦చందమరినను
వెలయుతీరునాళ్లసా రెల్ల ♦ విస్తరిల్ల
విన్నవించెద మది గడుఁ ♦ బ్రీతి నొంద. 2

ఉ. ఆరయ సిద్ధుఁ డట్లుచట ♦ నాలయముల్ రచియించి
వేడ్కలో, ప్పారఁగఁ బూజ నిత్యము మ♦హాభయభక్తులఁ
జేయునట్టి పూ, జారుల నేర్పరించి. విధి♦సంగత మాశివరాత్రి
యందు వే, చేరి మహోత్సవం బెపుడుఁ ♦ జేయఁగఁ
గట్టడి సేసి యేఁగినన్. 3

—♦ ఋతువర్ణనము ♦—

ఉ. భాసిలెమాఘమాస మతి♦భాస్వరభాస్కరభాసమాన్లహో
పాసనపూతతాపసము ♦ భావజదీపనశైశిరానిల
త్రాసితపాంథమానసము ♦ రంజితవంజుళకుందమంజరీ
వాసితదిగ్వికాసము ది♦వౌకసు లెన్నఁగ సుప్రకాశమై. 4

తే. పరమహంసుఁడ నయ్యును ♦ బాడి దప్పి
దక్షిణాశను మెలఁగుట ♦ తగవు గాద
టనియొ భానుఁడు తేజస్వి ♦ యగుచు మిగులఁ
జనియె లోకోత్తరోన్నత♦స్థానమునకు. 5

వ. అపుడు. ౬
ఉ. తాఁకి పలాశమండములు ♦ త మ్మొదిరించి బిఱాన మొగ్గలన్
బాకులు సూపి శేఁగి తమిఁ♦బల్లవచేష్టల నుల్లసిల్లఁగా
సోఁకెకుభూత మం దొదవి ♦ సొమ్మసిలంగను జేయుఁ గానలో
నాకులపాటు కొమ్మల క♦హా! కలిగెన్ వనదుర్గమస్థలిన్.
ఆ. గాలివేఁటకాఁడు ♦ గహన మృగావలయందుఁ
చెట్టు లన్నులుఁగులఁ ♦ జిక్కఁబట్టి
యెఱక లూడ్చి ధరణి ♦ నేసెనో యనుమాడ్కిఁ
బండుటాకుగములు ♦ వడియె నపుడు. ౮
చ. అసహహిమాగమాహముల ♦ కల్కి కృశానుఁడు వృక్ష
దారులన్, మసలక డాఁగి యుండి చలి ♦ మాయుట దోఁచి
నఁ దిన్న తిన్నఁగా, వెస శిఖలన్ బయల్వెలిచి ♦ వేసవిరాక
కుఁ దొంగి చూచెనో, పస ననుమాడ్కి శాఖలను ♦ బల్లవ
సంతతి దోఁచె న త్తఱిన్. 9
చ. పిక మనుగారడీఁ డిగురు♦పిం డనునగ్ని మ్రింగఁ బూనఁగాఁ
జకితమతిన్ వనేందిరయుఁ ♦ జయ్యనఁ గాంతిని మార్చి
వానినిన్, వికలతఁ జెందకుండఁగను ♦ వేగమ కప్పెనొ నాఁ
బ్రశస్త మౌ, శుకనికరాభ మౌపసిమి ♦ చూడఁదగెన్ దలి
రాకులం దొగిన్. 10
చ. ద్రుతగతిఁ జేరఁ బాతి వెము♦రుంబొడ లాగగనంబు ముట్ట న
ద్భుత మగువాన్ని వేటులను ♦ దూలినతారలు నేల రాలి జా
రతికుతుకంబునన్ మరల ♦ నభము నెక్కఁగఁ గోరి మ్రాఁ
కులన్, జత గాని నిల్చె నా వెలసెఁ ♦ జక్కని మొగ్గలు
వృక్షశాఖలన్. 11

సీ. చక్కెఱవిల్తుని♦సమ్మోహనాస్త్రముల్
జమిలిముక్కాలుల♦చలిదిముద్దలు
వనరాశివనరాశిఁ ♦ బరగిన బుగ్గలు
తరు లనుమఘవులఁ ♦ దగులుకనులు
మధుసుధాపరిపూర్ణ♦మంజులకలశముల్
సుమరజశ్చందన♦చూర్ణపుట్టి
కలు వనఖనిఁ బుట్టు♦ఘన మైనహీరంబు
లెన్నఁగా విరహుల ♦ కెదురుచుక్క
తే. లఖిలవిషయాగ్రగణ్యంబు ♦ లనఁగఁ దనరి
సకలపూజలకును దామ ♦ సాధనంబు
లగుచు గుబురు లై సొంపుగా ♦ నలరి మిగులఁ
దోఁచెఁ బువ్వులు కొమ్మలఁ ♦ దొడవు లనఁగ. 12

తే. జమిలిముక్కాలిజవరాండ్రు ♦ జతలఁ బాడ
శుకపికాంగన లేతెంచి ♦ చూచి పొగడ
రజము రమ్యాంశుకాప్త మై ♦ రహిఁ వహింపఁ
బుష్పవతి యయ్యె వనలక్ష్మి ♦ పొటమరిల్లి. 13

చ. అలరువసంతనూతనవి♦హారము నొంది వనాళిలేమ యు
జ్జ్వలితశలాటుయోగమున ♦ సంభృతగర్భిణి యయ్యె మంజరీ
మిళితమిళిందయోగమున ♦ మేలికుచాగ్రపునల్పు ధూళికా
ఛలమున వక్త్రపాండిమముఁ ♦ జారుమరందము ఘర్మ మై
తగెఁ. 14

క. వనరాశి యగుట మరకత
మణిగణములు పుట్టె ననఁగ ♦ మ్రాఁకులఁ గాయల్

ఘనసుప్రకాశ మొందెను
వనలక్ష్మీస్ఫురదురోజ♦వైభవ మేసఁగన్. 15

శా. భూపుత్రుండను నేను బాదపములున్ ♦ భూజంబు లన్
వేడ్క లోఁ, దోఁపన్ వచ్చి కుజుండు సోదరకృపన్ ♦ దోఁ
బుట్టు తోఁచెట్లన, ద్వ్యాపారంబులఁ జూడఁ గోరి ఫలరూ♦ప
ప్రాప్తిఁ దా నిల్చె నా, నాపద్మారుణరత్నకాంతులను గా♦
యల్ మించె వృక్షంబులన్. 16

మ. శుకతుండాగ్రవిదీర్యమాణఫలజ♦స్రోతోరసాసారముల్
వికసింపం గుసుమంపుఁజాలు మెఱు పై ♦ విస్పైనగ్గాధ్వ
నుల్, పికనాదంబులు గాఁగఁ బల్లవమిళ♦త్ప్రితచ్ఛదంబుల్
ధనుః, ప్రకరం బై తగ వన్యసీమ గనియెన్ ♦ వర్షాగమో
ద్యోగమున్. 17

చ. సరసులఁ గూడుతమ్ములను ♦ సారెకు న్యార్పులఁ జేరి దూఱు
చున్, సరవి రజస్వలాప్రసవ♦సంకరజాతులపొందు మెచ్చు
చున్, మరగక కాంచనంబులను ♦ మంజులతామ్రమము
లాశ్రయించెఁ బో, మరతను దేంట్లు; నిత్యమధు♦మత్తుల
కేటివివేక మారయున్ ?. 18

ఉ. ప్రెగ్గడ యావసంతుఁడు గఁ ♦ బెద్దవజీరుగఁ బిల్ల తెమ్మెరల్
భ గ్గనుకోకిలంబు దళ♦వాయి గఁ దుమ్మెదపిండు దండు గా
నిగ్గులఖత్తు లాణ మది ♦ నెప్పరి చిల్క శరంబు దండిపూ
మొగ్గయుఁ గా మరుం డడరి ♦ ముట్టెను ముట్టడి వేయఁ
బాంథులన్. 19

క. తమ్ములపేరిటిమరుకుం
తిమ్ములు నాటంగ విరహి♦తండముఘనచి

త్తమ్ములు ధైర్యరమావి
త్తమ్ముల నెసఁ గోలుపోయి ♦ తల్లడపడియెన్. 20

క. శిశిరవసంతగుణంబుల
విశద మగుచు మాఘలక్ష్మి ♦ వృజినము దేభాం
కుశశివరాత్రియు వచ్చెను
శశిశేఖరుభక్తజనము ♦ సంతోషింపన్. 21

తే. అధికదారిద్ర్యశమయిత్రి ♦ యభయదాత్రి
వచ్చె శివరాత్రి పుణ్యముల్ ♦ పండుధాత్రి
పంచపాతకవల్లికా♦పటులవిత్రి (?)
మాఘకృష్ణచతుర్దశీ♦మహితరాత్రి. 22

వ. అంత నప్పు డప్పుడమిఱేఁ డంతకు మున్న లోకానందియగు మహానందిఁ జేరం జని యందుఁగట్టురాపట్టిచెట్టఁబట్టినట్టిదిట్టకు జోహా రొనరించి యప్పుడ చనుదెంచియున్న వాఁడు దన్నుఁ బొడసూపి ప్రణమిల్లుపాళెంపుమన్నెదొరపిన్నవాని మన్నన చేఁ గాంచి వానితోడంగూడి పొన్నలగున్నలనీడల వేడుకలు సేయుపల్లవ ఫల పుష్పాభిరామం బగువనంబు చూచుచు మచ్చిక నచ్చెలికానితో ముచ్చట లాడుచు మాఘమాహాత్మ్యంబును మహాశివరాత్రిప్రభావంబు నుపన్యసించి మన మిప్పుణ్యదినంబులయం దీపురాతనదంపతు లగుమృడానీమృడులకుఁ గల్యాణమహోత్సవంబు సలిపి దానం గృతకృత్యులము గావలవదే! యనినఁ గిరాతనేతయు విని వినయంబున ముఖవిలాసంబు నెఱపి మహాత్మా! నాచేఁ బనిగొనుట కీవ యొడయుండవు పనిచినపను లేఁ జేయుదు నానతీయవలయు ననిన సంతోషించి నీ విందలిప్రాకారమండపాదుల

నలంకారము సేయించి కల్యాణమహోత్సవంబునకు వల
యుసమస్తసంభారంబు లాయితంబు సేయింపు మని నిర్దే
శించి యచ్చోటు వాసి. 23

ఆ. రాజు వెడలె నంత ♦ రమణతో శివరాత్రి
పూర్వదినపురాత్రి ♦ పురమునుండి
యుత్సవంపుమూర్తి♦యుగళము గొనిపోవ
మనము కౌతుకంబు ♦ మహిమ దనర. 24

వ. ఇట్లు రాజు నంద్యాలయంబున కరుగుటయు నంత నిక్కడ.

ఉ. బోయలనాయఁ డూడిగపు♦మూఁకలఁ జేరఁగఁ బిల్చి వార
లన్, సోయగ మేర్పడం దనరు♦శూలిని కేతనమందు మెల్పను
త్సేయఁగఁ బంచెఁ బంచుటయుఁ ♦ జెట్ల వెదుళ్ళను ద్రుంచి
వానిచేఁ, బాయలు దీర్చి కట్టి రఁట ♦ బాగుగ వీథులు
నిండ్లు బంతి గాన్. 26

చ. రజకులు కుంభకారకులు ♦ రౌతులు చెంచులు బెస్తలోడ్డె
లున్, సుజనులు వడ్లకమ్మరులు ♦ సోమకళాధరుగేహవాటి
లోఁ, బ్రజ కనురాగ మేర్పడఁగఁ ♦ బందిళులుం దగు
చప్పరంబులున్, గుజములనీడ వేడు కగు♦కొట్టములున్
రచియించి రెల్లెడన్. 27

చ. మసలక సున్నముం గలిపి ♦ మాయనిపూఁతలు పూసి
రంగుతోఁ, గొనలను జాలు దీసి ఘన♦గోపురకుంభము లెత్తి
యాగుడిన్, గసవులు చిమ్మి నీర్చిలికి ♦ గందపుఁబూఁతలు
పూసి ముచ్చటన్, బస గలరంగవల్లికలు ♦ పచ్చనితోరణ
పాళి యేర్పడన్. 28

క. వెలయించిన. 29

చ. పసుపును గుంకుమంబు ఘన ♦ భాజనముల్ శయనాసనాదు
లున్, వసనము లూఁదువత్తులు సు ♦ వాసనవస్తువు లాకు
వక్కలున్, పొసఁగుపదార్థరాసులును ♦ బూర్ణము తొఘృత
తైలకుంభముల్, పస గలస్రుక్స్రువంబులును ♦ బావన
వస్తువు లుంచె నచ్చటన్. 30

వ. రాజనందనుండును సంధ్యాలయంబున నెఱుగుచుండి తత్పుర
వనోపకంఠంబున సముత్కంఠకలకంఠకంఠోదితవికస్వరస్వరం
బులకు భవనంబు లగువనంబులను వనంబులకు నికటంబు
లగుతటాకంబులను దత్పరీవాహసంవర్ధితకలమమంజరీపింజరీ
భూతకేదారంబులను, వాని కిరుగెలంకుల సమున్నిద్రహరి
ద్రావాటికలను, వానిపిఱుంద సత్యైక్షవక్షేత్రంబులను, వాని
కుఱంగట వేల్లితనాగవల్లీవాటికలను వీనిచే నభిరామం బగు
ప్రాకారంబుం జూచుచుఁ బురంబు సొచ్చి నగరు సేరి చారులం
బనిచి కులవృద్ధుల రావించి సత్కరించి దేవతామహో
దంతం బెఱింగించి వారలయనుమతిచేఁ బురాలంకారంబు
సేయఁ జాటం బంచుటయు నప్పు డప్పురంబు సమ్మార్జిత
సంసిక్తమార్గంబును సుధాధవళితగృహంబును నవతోరణా
లంకృతంబును నున్నమితధ్వజంబు నుజ్జృంభితతూర్యఘోషం
బును నానావస్తువిస్తారితవిపణిమార్గంబును నవీనవస్త్రాభరణా
లంకృత తరుణీతరుణజనంబును దేశాంతరాగతజనసమ్మర్దంబు
నయ్యె నట్టియెడ. 31

తే. రాత్రి వేవేగ రాఁ గోరు ♦ నీత్రినేత్రుఁ
డుత్సవముతోడ మెఱయుట ♦ కూరిలోనఁ

బవలు కుదిఱుప నాకు నొ♦ప్పదె యటంచు
నరిగె భానుఁడు పడమగత్తి ♦ యస్తగిరికి. 32

ఆ. చెలఁగి భానుఁ డనెడు♦సింగంబు తననీడ
కడలినీటఁ దోఁగ♦గాఁ భ్రమించి
క్రొత్తసింగ మనుచుఁ ♦ గ్రోధించి దుమికెనో
యనఁగఁ దరణి కడఁక ♦ నబ్ధిఁ గ్రుంకె. 33

మ. వరసంధ్యారుణరాగలక్ష్మి వెలసెన్ ♦ భాస్వన్నభోప్రాదిసీ
వరతీరప్రభవప్రవాళలతికా♦వర్ధిష్ణుసందోహ మై
సిరిఁ జెన్నొందెను దార లంబరవనీ♦సీమప్రసూనాళి నై
పరువథ్వాంతము నిండి పర్వె దిశలన్ ♦ భవ్యాంజనాసార మై.

వ. అట్టియెడ మహేశ్వరునకు గ్రామోత్సవసమయం బగుటయు
నద్దేవాయతనసమీపంబున. 35

శా. దిక్కుడ్యంబులు భేదిలంగ, జడులై ♦ దిక్పాలకుల్ నిల్వఁగాఁ,
జుక్కల్ రాలఁగ, నంబరం బ్రదువఁగా ♦ శోషింపఁగా
సింధువుల్, దిక్కుంభీంద్రులు ఘీంకరింప, సకలా♦ద్రివ్రాత
ముల్ క్రుంగఁగా, నకాలాంతకుకో వెలన్ మొఱసె హృ♦
ద్యానేక భేరీధ్వనుల్. 36

క. ఆధ్వని చెవిఁ జొరునంతన
గోధ్వజుకడ నుండు సేవ♦కులు తమపనులన్
సాధ్వస మడరఁగ వలద
ధ్వాధ్వరభంజనుగృహంబు♦నందు నిలుచుచున్. 37

క. రాజాధికారివర్గము
లాజనులను వారిపనుల♦యందుఁ జొనుప జా

గౌఁజిగిని మించి రంజిలు
పూజాకార్యముల నెల్ల ♦ భూపతి పొగడన్. 38

ఉ. ఛత్రము చామరద్వయము ♦ చాటులు పూనఁగ, ముందు
కంచుకుల్ వేత్రము లూని గుంపులను ♦ వేగమ పాపుచుఁ
బోవఁ, జంచలా, గాత్రులు వేశ్య లాడఁగను ♦ జ్ఞాతులు
మంత్రులు బ్రాహ్మణోత్తముల్, స్తోత్రము సేయువందిజను♦
లుం జనుదేర ధరాధినాథుఁడున్. 39

వ. దేవాలయంబు ప్రవేశించె నప్పు డచ్చటిపౌరులు కాలోచితంబుగా నారాజును సంభావించి రాజానుమతంబున దేవతాయతనంబు సొచ్చి భవానీ శంకరుల దర్శించి ప్రదక్షిణ నమస్కారంబు లొనర్చి తాంబూల మాల్య ఖర్జూరాదు లొసంగి సేవించి కర్పూరంబుచే నివాళించి మంత్రపుష్పం బిడి ప్రసాదస్వీకారంబు సేసి బాహ్యమండపంబు సేరి యాటపాటల వినోదించుచుండి రప్పుడు. 40

క. మది ముద మొదవఁగ సర్చకు
లద నరసి పురారి నారి♦యం దుత్సవ మిం
పొదవఁగ నూరేఁగింపఁగఁ
బదిలముగ నలంకరింపఁ ♦ బనిఁ బూని వెసన్. 41

చ. శివులఁ బసిండిచప్పరపు♦సీమల నుంచి యలంకరించి మ
క్కువఁ గొని రాజవీథులకుఁ ♦ గోవెలముంగిటనుండి మంగళా
రవములు మున్నుగా నరిగి ♦ గ్రామమునందుఁ బ్రదక్షిణంబుగా
జవమున నేఁగి పిమ్మటను ♦ జాతర కంపెను రాజు దేవునిన్.

సీ. నిస్సాణశంఖముల్ ♦ నింగి ముట్టఁగ మ్రోయఁ
గరదీపికావళి♦కాంతి మెఱయ
జయజయధ్వనితోడ ♦ శైవులు సనుదేరఁ
జామరకరు లను♦చరులు నడువ
వేదఘోషముతోడ ♦ వేత్తలు మునుకొన
వేత్రహస్తులు ముందు ♦ వెలయుచుండ
వరవృషభాంకిత♦ధ్వజమును గొని మున్న
పరిచారకులు చాల ♦ పరిఢవిల్ల

తే. మేల్పసిఁడిచప్పరంబులోఁ ♦ బొల్పుమీఱ
భూషణాంబరకాంతులు ♦ పొదలి మెఱయ
ఛత్రమందలిముత్యాల♦సరులు పొదల
సంద మలర దేవుఁడు మహా♦నందిఁ జేరె. 43

క. తిమ్మాపురమునఁ గలశివ
సమ్మతు లగుజనులు గూడి ♦ సరగ నరుగునా
కమ్మవిలుకానివైరిని
నెమ్మదిగాఁ గొలువఁ జనిరి ♦ నిశ్చలభక్తిన్. 44

వ. మఱియు నద్దేవునిఁ గొలువ గ్రామణీ గ్రామపాలక గణక లేఖక పురోహిత వైద్య దైవజ్ఞులును, ఘటికానిర్ణాయకులును, భాండాధికార ధాన్యాధికార పాచక పరిచారకులును, విద్యా దాగమజ్ఞ కావ్యజ్ఞ పౌరాణిక మాంత్రిక ఋత్విగాదులును, సూత మాగధ వంది వైతాళిక చ్ఛాత్రిక చామరిక తాళవృంతిక తాంబూలిక కరదీపిక మల్ల మార్దంగిక వర్తక గాయక వైణిక వైణవిక ఘాంటిక పరిహాసక లోహ

కార రథకార రజక కుంభకార నాపిత పశుపాలకులును,
జనుదెంచిరి తదనంతరంబ. 45

సీ. తౌరంగికులు గూడి ♦ తాల్మిచేఁ దేవీల
నాట్యంపుఁబోకల ♦ నడుపుచుండ
వివిధాస్త్రపాణు లై ♦ వీరసైనికభటుల్
మీసముల్ దీడుచు ♦ మెలఁగి నడువ
గజఘోటకాదులఁ ♦ గ్రక్కున నవు డెక్కి-
రాజనందను లెల్ల ♦ రమణ నరుగఁ
బల్లకీ లెక్కిన♦భామినీజనములు
రాణివాసస్త్రీలు ♦ రహిని జనఁగ
తే. భద్రగజమును దా నెక్కి ♦ భద్రలీల
ఛత్రచామరకరు లను♦చరులు నడువ
సౌవిదల్లకబృందంబు ♦ సరభసముగ
ముందు నడువంగ భూపతి ♦ పురము వెడలె. 46

తే. బండ్లమీఁదను నొంటెల♦పైన సకల
శయన భాజన భోజన ♦ సరసవస్తు
భరము నెక్కించి వెన్వెంట ♦ భటులు నడువ
రాజుపయనంబు మిక్కిలి ♦ రమ్య మయ్యె. 47

వ. అంతం బ్రభాతం బగుటయు. 48

—♦ ప్రాతఃకాల వర్ణనము. ♦—

సీ. పాలయాల్కఁ దొలఁగిన♦పాలఁతులఁ బతిఁ గూర్చ
మాంత్రికు లివి యన ♦ మహిమఁ దనరి
నీరేజముకుళముల్ ♦ నేర్పుతో విరియించు
బదనిక లివి యనఁ ♦ బాళి మించి

మాఘవ్రతస్నాతృ♦మానసిశజపచల
దోషసంస్ఫురణల ♦ కూఁతలగుచుఁ
గిసలయకరకాంత♦గిరిమల్లికాళికిఁ
గుదిరినవర్తన♦గురువు లగుచు
ఆ. మాఘసుప్రభాత♦మందమారుతములు
దిశలు కడు వడంకఁ ♦ దీవ్రగతుల
వీవసాఁగెఁ గుసుమ♦విసరసువాసనా
వాసితంబు లగుచు ♦ వనమునందు. 49
ఉ. కైరవినీలతారమణి ♦ కాంతకరప్రకరాభిమర్శచేఁ
గోరకపాళి యర్కకరులు ♦ గుప్పున విచ్చి మదించి పద్మినీ
జారను జేరికిం గొనక ♦ పొంగియుఁ, బద్మిని మీఁజ గాసిలెన్
గారవహాని గాదె? కడు ♦ గర్వికి నెందుల నేని భూమిలోన్.
సీ. కలకలధ్వనితోడ ♦ ఘనవృక్షశాఖలఁ
బక్షిసంఘము చాల ♦ పరిఢవిల్లె
ముఖపాండిమము దోఁప ♦ బూర్వదిగ్భామిని
గర్భిణీచిహ్నముల్ ♦ గరిమఁ దాల్చె
నరుణప్రభాజాల ♦ మంతట నిండారెఁ
గోకిలోకము చాల ♦ కొమరు మిగిలెఁ
దారకానికరంబు ♦ ధవళిమఁ దొలఁగెను
దిమిరరిబు విఱిసె ను♦ద్వృత్తి యణఁగి
దీపసందోహంబు♦దీధితు లొగి మాసె
మదనుఁడు తనధను♦ర్మౌర్వి డించె
తే. కడుపు నిండఁగఁ దుమ్మెద♦కదుపు. లపుడు
వేఁడియూఱనితమ్ములు♦ వెక్కసంపు

మానుష్య ద్రావిడమదంబుచే ♦ మానవస్తుతులఁ
దిరిగి గానంబు సేసెను ♦ దేవళంబు. 51

వ. అప్పుడు. 52

సీ. నందీశుఁ గనుఁగూడి ♦ పడిచెను దేవతా
కోటి రెట్టింప హేమ♦కుంభ మనఁగఁ
బ్రాక్సతిమోమునఁ ♦ బాటించి యిసుకొన్నఁ
బొల్చు కుంకుమచుక్క♦బొట్టనంగ
మందేహగణముల ♦ మర్దింప శౌరిచే
సంప్రేషితం బైన♦చక్ర మనఁగ
జలధివాసము రోసి ♦ చద లెక్కుచుండెడు
బాడబజ్వాలల♦ప్రభ యనంగ
ఆ. సర్వవేదమయుఁడు ♦ ఛాయాసమేతుండు
బ్రహ్మవిష్ణుశంక♦రస్వరూపుఁ
డఖిలయోగిజనులు ♦ నరిగెడుమార్గంబు
సూర్యుఁ డుదయమందె ♦ సురుచిరముగ. 53

క. బాలాతపనికరంబులు
నేలయు దిశలుఁ దివంబు ♦ నెరయఁగ వెలసెన్
శూలిమహోత్సవవేళను
బోలన్ బంగారుపూఁత ♦ పూసినకరణిన్. 54

క. అలికియు మృగమదమున ము
గ్గులు వెట్టియుఁ గప్పురమునఁ ♦ గుంకుమమున నో
రలవఱచినమండపమున
నలదేవునిమూర్తి నిలిపి ♦ రౌత్సుక్యమునన్. 55

వ. అంత నమ్మహీధవుండు పరివారపురస్సరుం డై మహానంది
క్షేత్రంబు సేరి పుష్కరిణీజలస్నాతుం డై కాలోచితకృత్యం
బులం దీర్చి సూర్యోపాస్తి సేసి యగ్నిసమారాధనం బొన
రించి బ్రాహ్మణులకు నమస్కరించి పాశుపతాగమవేత్తల
నడిగి శైవయాగపురస్సరం బగుకల్యాణమహోత్సవంబు
నకు వలయుపదార్థంబులం దేరం జాలం బంచి యుండె
నంత మంత్రులును, బటకుటీరంబుల రాజదారలను
విడియించి చతురంగసైన్యంబుల వనసమప్రదేశంబుల నిలిపి
చోరాదిబాధ లుడుప రాజపురుషుల నియమించి స్నానాది
క్రియలు నిర్వర్తించి రాజును గొలిచియుండి రంత. 56

క. జల్లిపాళెమునాయఁడు
పల్లకిపై నెక్కి వెడలెఁ ◆ బటహధ్వనితో
బల్లిదులు భటులు నడువఁగ
భిల్లసమూహంబు గొలిచి ◆ బిలబిలఁ జనఁగన్. 57

క. ఊడిగపువారు కొలువఁగ
నాందోలిక నెక్కి కదలి ◆ రాజాంగన లా
వేడుకలు చూడ నరిగిరి
బాడబసతులు తమయిండ్ల◆పైఁ జనుదేరన్. 58

చ. వెలినునుబూదిరేకలును ◆ వెల్లనిగందపుఁజుక్కబొట్లు చుం
గులతలపాఁగ లందముగ◆కోఱలమీసలు నిల్వటంగులున్
వలితపువల్లెవాట్లు పలు◆వన్నెలకమ్మరుబందులందు బాఁ
కులు వెలిచల్లడాలు గల◆కోయలుబోయలు వచ్చిరయ్యెడన్.

సీ. వెడిగొల్సులు వేసి ♦ వేడ్కతోఁ దెచ్చిన
కుక్కలు తమవెంటఁ ♦ గూడి రాఁగ
బవిరిగడ్డంబులు ♦ భాసిల్లుకీలుమెట్లు
చేతిపై డేగలు ♦ చెలఁగుచుండఁ
బలువిధంబులు గాఁగఁ ♦ బలికెడుకౌఁజులు
లావుకల్ పంజరా♦లను జెలంగ
నాకు తుపాకియు ♦ బరిగోల లీఁటెయుఁ
జాలుకత్తియుఁ గను♦శంబు గూర్చ
ఆ. బోయదొరల వెంట ♦ బోయలు గుఱికాఁడ్రు
చెంచునాయకులును ♦ జేరి కొలువఁ
దఱిమి తఱిమి పయిఁడి♦తప్పెటల్ వాయింపఁ
జేరి రెల్లవారు ♦ శివునిఁ గొలువ. 60

వ. ఇట్లరిగి మహానందిఁ జేరి పార్వతీభాగంబునందలి బజారు హజారంబు నాక్రమించి శిబిరంబుల విడిసి సర్వదిశారక్షకు లై యుండి రంత. 61

ఉ. కేల నెసంగుపుట్టికలఁ ♦ గొంజగిపువ్వులు బిల్వ మళుతల్
చాల గ్రహించి బాలుర భు♦జంబులమీఁదను జేర్చుకొంచు
నా, లీలను మూట శీర్షమున ♦ లెస్సగఁ దాల్చి సధర్మ
పత్నులై, వాలినభక్తి నచ్చటికి ♦ వచ్చిరి భూసురు లీశుఁ
గొల్వఁగన్. 62

ఆ. మఱియుఁ గొంద ఱందు ♦ మాన్యత గలవారు
బండ్లయందు మేలి♦భటులమీఁద
భారచయము లుంచి ♦ బంధుసమేతు లై
చేర వచ్చి రపుడు ♦ శివునిఁ గొలువ. 63

ఉ. జీరక సస్షి పాదికవి♦శేషపదార్థము లుప్పు నెంతి క
ర్పూరము నారికేళములు ♦ పూగ లవంగ ఘృతేక్షు శైల
ముల్, కూరలు పప్పు బియ్యములు ♦ గూర్చి గుడారు
లమర్చి పెన్నబా, జాలు జేర్చి యమ్ముటకుఁ ♦ జయ్యన
వచ్చిరి వైశ్యు లత్తఱిన్. 64

మ. నవరత్నంబులు మంచిమంచితొడవుల్ ♦ నానావిచిత్రాంగ
ముల్, సవరంబుల్ దగుచిత్రకంబళము లం♦చద్దాలఁడ
జాలంబు లు, చ్ఛవికాంస్యామలభాజనంబులు జరీ♦శాల్వాల్
సరాల్ వస్త్రముల్, శివరాత్ర్యుత్సవమందుఁ జేర్చిరి
వెసన్ ♦ శ్రీమించుబేహారులటన్. 65

ఉ. గాజులు నల్లపూసలును ♦ గంధపుదిన్నెలునూఁదువత్తులున్
రాజులు మెచ్చునత్తరు స♦రంబులు గూర్చినముత్తియంబు
లున్, లాజలు లడ్డుకాదులు ఫ♦లమ్ములు బొమ్మలు పూల
దండలున్, భూజను లెల్ల మెచ్చఁ దగు♦పొల్పగువస్తువు
లమ్మి రచ్చటన్. 66

సీ. హాలికుచంబుల ♦ నంటి చూచెద లేమ !
యాలికుచంబుల ♦ నంటు మచట
వలువ దొలంగింపు ♦ వైనంబు చూచెద
నీధర-నీ కమ్మ ♦ నేల వలవ ?
బదరీఫలం బైన ♦ భావించి కొననిమ్ము
కఠినహృదయ మిది ♦ కాంక్షపడకు
మానసనీగోస్తనీ♦మంబ కైనను గొందు
మందలకడ కేఁగు ♦ మరలి వత్స !

ఆ. యొంటి నటి చూతు ♦ నోడకు వాల్గంటి!
చూడు మొంటి గనుట ♦ చోరవృత్తి
యనుచు జాణ లిట్టు ♦ లెసయువాక్చతురతఁ
బండు లమ్మి రచటి ♦ ప్రాసాలందు. 67

మ. గళఘంటానినదంబుతోడ నొగలన్ ♦ గస్పట్టునత్యాశతో
నళినాక్షీజనబాలవృద్ధభటస ♦ న్నాహంబుతో దొడ్డకం
బళముల్ బియ్యము నేయి శాకగుడముల్ ♦ బండ్లన్ బ్రతి
ష్ఠించి యా, యళికాక్షుం గొలువంగ వచ్చిరి మహా ♦ యత్నం
బుతో రెడ్లొగిన్. 68

క. గంతులు వైచుచుఁ జరవల
దొంతులు శిరమందు మెఱయఁ ♦ దో తెంచిరి ది
గ్గంతులవలె సాతానులు
బంతులుగాఁ గూరుచున్న ♦ బలియుర వేడన్. 69

ఆ. నెమలికుంచె లెత్తి ♦ నెత్తులపైఁ గొట్టి
గరుడగంబ మెదుట ♦ గరిమ నిలిపి
కాను కిమ్ము టంచుఁ ♦ గదిసిరి దాసల్లు
ద్వారశాఖలకడఁ ♦ దఱిసి యుండి. 70

ఆ. జంగమయ్యగారు ♦ జాగార మం చని
బూది నొసటఁ జుక్క ♦ బొట్టు వెట్టి
బొట్టు పెమ్ము టంచు ♦ బోధించి పలుకుచుఁ
దిరుగుచుండి రపుడు ♦ తిరముగాను. 71

వ. మఱియు. 72

మ. గుహాలం దెల్లఁ బ్రతిధ్వనుల్ పొడమ నా ♦ ఘోషంబునన్
సాలభా, క్కుహనాసింహముఖాంతరాళబిలముల్ ♦ గోలా

హాల్క్రాంత మై, ముహురుచ్చేద్ధ్వనితో డ నిండ వెల
సెఁ ♦ మోదంబు పుట్టించున, మ్మహానీయేశ్వరపూజనావ
సరస♦న్మధ్యాహ్నఘంటాధ్వనుల్. 73
శా. ద్యోమధ్యంబున భానుబింబ మడరెఁ ♦ దూలించుచుఁ
బాంథులఁ, స్తోమం బై మృగముల్ వసించె విటపా♦స్తోకో
చ్ఛ్రయచ్ఛాయలఁ, ధూమాంచద్దవికాంతరుట్శిఖిశిఖా♦
ఘాతంబు లయ్యెఁ దిశ, ల్వే మించెఁ మృగతృష్ణికావిసర
మో♦లిఁ భూమిభాగంబునఁ. 74
వ. అత్తఱి సమస్తజనంబులు మహేశ్వరసేవాకుతూహలదోహ
లితమానసు లై స్నానోపకరణంబులు సమకట్టి స్త్రీ బాల
వృద్ధ పరిజన పరివృతు లై చనుదెంచి. 75

—♦ జలక్రీడాభివర్ణనము. ♦—

క. హల్లకపరిమళపరివృత
కల్లోలవిదీర్యమాణ♦ఘనశైవల మా
చల్లనిపద్మాకరమునఁ
గొల్లగ జలకేళి సలుపఁ ♦ గోరిరి వేడ్కన్. 76
ఉ. శ్రీమహితేశలింగపద♦సీమను వెల్వడి జాహ్నవీతరం
గామలతీర్థ మై బసవు♦నాస్యములోపలనుండి పొంగి ని
త్యామితధార గంగ గమ♦లాకరముం జొడఁబొఱి సర్వపా
పామయహారి యాలహరి ♦ నబ్జజుఁ డైన నుతింప నేర్చునే?.
వ. ఆకొలంకునకు గెలంకులం బంకిలం బగుట గని గద్వాలకృష్ణా
గ్రహారమునుండి యీశ్వరసందర్శనార్థు లై యరుగుదెంచి
యుండి. 78

క. రామావఘాతనామ
స్వామములు యాత్రికజనాళి ♦ సౌఖ్యముకొఱకై
తామరకొలంకుచుట్టును
నేమంబున ఱాతిదరిని ♦ నిర్మించి రొగిన్. 79

తే. ఆదిశంకరదేశికు ♦ లాసరసున
నవ్యమోహినీయంత్రంబు ♦ నాటి యుంట
జతలఁ గోనేటినీటను ♦ సతులు పతులు
గూడి క్రీడించుచుందురు ♦ కుతుక మెసఁగ. 80

ఆ. మగలు ముందు మిగిలి ♦ మడుఁగులో డిగి ప్రేమఁ
జార సాఁచి తమ్ముఁ ♦ జేరఁ బిలువ
మగువ లెల్ల భీరు ♦ లగుట సందునఁ జొర
నొల్ల రెంత కొసరు ♦ చున్న వినక. 81

మ. కుచకుంభంబుల నమ్మి కొంద ఱబలల్ ♦ గుప్పించి యా
నీటిలోఁ, బ్రచురం బైసముద్రంబు దోఁప దుముకన్ ♦ భారం
బు లౌతత్కటి, కచముల్ వారిని ముంపఁజూచె గతశం♦కన్
వారు తద్భర్తలన్, గుచపీడాకృతిఁ గౌఁగిలించి రట సం♦కో
చించె నేత్రాబ్జముల్. 82

మ. కచశైవాలములన్ భుజాలతికలన్ ♦ గంఠాఖ్యశంఖంబులన్
గుచకోకంబుల నేత్రమీనముల వ్యా♦కోచాస్యపద్మంబులన్
రుచిరోజ్జృంభితయౌవనోదకములన్ ♦ రోమాళిభృంగాళులన్
బ్రచురోత్కర్షము నొందుయౌవతనదుల్ ♦ పాఱెం దదం
భోధికిన్. 83

ఆ. ఒకరిపైన నొక్క ♦ రున్నతంబుగ నెక్కి
వలయకలన మీఱు ♦ వాంఛ నిలిచి

యంతఁ బాసి మడుపు♦నందున దుముకుచుఁ
గ్రీడ సలిపి రచటి♦కేడ్గివారు. 84

మ. మదదంతావళిగామినుల్ కమలినీ♦మధ్యస్థ హాసంఘమున్
గుదురౌ స్వస్తనకుంభికుంభశిఖలన్ ♦ కుంతమ్ములన్ గుమ్ము
చున్, గదియం జేర వయస్థు లెల్ల వశులై♦కందర్పదర్పోద్ధ
తిన్, గుదియన్ సాఁగిరి చూప తెల్లఁ గొలనన్ ♦ గొండా
డుచుండం గడున్. 85

చ. నరకరినాథు లక్కొలఁకు♦నం బడి యీఁది మృణాళజాలముల్
వెఱికి పరస్పరాహతుల ♦ వేడుక సల్పి జలంబు చల్లుచున్
దిరిగి కలంచుచుండఁగను ♦ ద్రిప్పుడు చెంది జలంబు లన్ని
యున్, దిరిగెఁ గులాలచక్రగతి♦దీపితదుర్వహభ్రమిభ్రమిన్.

క. మగువలు తమతమకాంతుల
బిగికౌఁగిళులందుఁ బొలిచి ♦ వేడుకలఁ జొరన్
ముగుద యొకతె తనుఁ బిల్చెడు
మగనిన్ సిగ్గొలయ డాసె ♦ మదనుం డార్వన్. 87

చ. చనుము తొలంగు పొయి మని ♦ జవ్వని శీలము దెల్పు
కైవడిన్, దనపతి చూచుచుండ జల♦ధారలు చల్లెను జార
భర్తపైఁ, గనలుచుఁ గోపగించుకొను♦కైతవ మేర్పడ
వాఁడునన్ బయః కణసుమవృష్టి ముంచె నల♦కాంత
కుచాద్రుల భర్త దేర్పఁగాన్. 88

ఆ. అంకులాఁడి యొకతె ♦ రమణుఁడు నీర్చల్ల
భయముతోడఁ దాను ♦ బడలినట్లు
రంకుమగనిఁ గదిసి ♦ రవళిఁ గౌఁగిటఁ జేర్చెఁ
జాన లవని నెంత♦జాణ లౌర !. 89

చ. కరములఁ దంపతుల్ జలము ♦ గైకొని ముచ్చటఁ జల్లు
లాడఁగా, శిరములనుండి జాఱెడు ♦ శీకరముల్ గనంగ జూడ
నొప్పె మరున్, మురువుగఁ బెండ్లినాఁడు చిఱు ♦ ముత్తియముల్
దలఁబ్రాలు వోసికో, దొరకొనునప్పు డవ్వి ధరఁ ♦ దోర
ముగాఁ బడుచున్నకైవడిన్. 90

ఆ. చనువు మిఱఁ నొక్క ♦ చాన ప్రాణేశుని
వెనుక నుండి వాని ♦ కనులు మూయ
స్పర్శమున నెఱింగి ♦ వాఁడు పేరునఁ బిల్చె
నంత నవ్వి రచటి ♦ కాంత లెల్ల. 91

క. జలకేళి సేయఁ దనపతి
పిలువఁగ నొకతన్వి తమ్మి ♦ వెలయుమధువుఁ గొం
దలిరుంచియమ్మనఁగ్రోవిని
జిలికె నతనిపైన భావ ♦ చిత్రము గాఁగన్. 92

తే. ప్రౌఢదంపతు లన్యోన్య ♦ రాగ మేర్ప
డంగ నందలికమలముల్ ♦ డంబు మీఱఁ
బెఱికివైచిరి నాఁచుఁ బెం ♦ పఱఁగఁ జేసి
రాత్మముఖకచసమ మవి ♦ యవునె ? యనుచు. 93

మ. సకియల్ కొంద ఱురోజముల్ జలముపై ♦ సంపూర్ణనీరే
జకో, రకముల్ నాఁ దనరంగ నిల్చి సరసన్ ♦ రంజిల్లఁ దద్భ
ర్తలు, పద్దు కొలంకున్ వెలి తూము నాఁపిరి జలంబుల్ ♦
మించె లోఁతైన నం, దక తమ్మేలఁగఁ బిల్చి రాత్మపతు
లం ♦ దా రెంతభీరుల్ సతుల్. 94

ఉ. దంపతు లుద్దులై సరసి ♦ దగ్గఱఁ జేరఁగఁ బ్రేమబంధముల్
పెంపుగఁ గొంగు ముళ్లిడిరి ♦ విప్రులు వారికి వారు చిత్రమం

దింపుగ మేలుకోరికల ♦ నెంచుచు స్నానముఁ జేసి రందుఁ; బు
న్నెంపుగనుల్ గదా! తలఁప ♦ నిక్కము భక్తులకొంగు
రత్నముల్. 95

శా. రాజ్ఞీబృందము రాజపుత్రులు భట♦ప్రఖ్యాతసంబాధ సా
యజ్ఞారాతితటాకముల్ దొరసి బ♦హ్వామ్నాయసంకల్ప
ముల్, ప్రాజ్ఞుల్ చెప్పుచు నుండఁ గ్రుంకులిడియ♦య్యాత్మీయ
దేశంబులన్, బ్రహ్మకోశల మెప్పుఁ జేసి రట స♦త్పాత్రంబు
లన్ దానముల్. 96

ఉ. నాగర వైశ్యరత్నములు ♦ నమ్మినబంటులు వెంటనంటి రా
రాగముతోఁ బ్రియాజనము ♦ రైభృదపత్యము లోలిఁ
గొల్వఁగాఁ, ద్యాగముసేసి కీర్తిసిరిఁ ♦ దాల్పను హెచ్చుగ
వచ్చి చొచ్చి రు, గ్రాగ్రధునిన్ ద్విజప్రకర ♦ మంతటఁ
గల్పము చెప్పుచుండఁగన్. 97

మ. బుసు లంసంబులఁ గఱపాలలు భుజా♦మూలంబులం దక్షి
ను, త్రసమూహంబులుఁ దామపాత్రలును జే♦తం దాల్చి
వెన్వెంట మున్, పసపుం గుంకుమఁ జేతఁ బూని దయితల్ ♦
భక్తిన్ బ్రవేశింపఁగాఁ, బసివాం డ్రాడుచు రాఁగ వచ్చిరి
మహా♦ప్రాజ్ఞుల్ సరోవాటికిన్. 98

వ. అట్టియెడ రాజభటనివారితసమ్మర్దం బగుటం జేసి యసంబా
ధం బగు పుష్కరిణియందు రాజనందనుండును వాని వెంట
సతిరాత్ర మహారాత్ర పౌండరీక సర్వతోముఖ యాజులును
సకలతంత్రప్రవీణులును నిత్యనైమిత్తికకామ్యకర్మానుష్ఠాత
లగుభూసురశ్రేష్ఠులును దమతమపురంధ్రులతోడం గూడి
ప్రవేశించి యీశాన్యకోణంబుఁ జేరి సంకల్పం బుచ్చరించి

జలాభిమంత్రణంబు సేయుచు సఘమర్షణసూక్తంబులు సెప్పుచు నవగాహనముచేసి గంగాదిపుణ్యనదులను స్మరించి సంపూర్ణార్ఘ్యంబు లొసంగి యంత శ్రీశైలతీర్థ మనియు శ్రీనృసింహతీర్థ మనియు దేవద్రోణి యనియు శ్రీనందితీర్థ మనియు శ్రీకాశీతీర్థ మనియుం బ్రసిద్ధి గలపంచధారాతీర్థములయందుఁ బ్రత్యేకస్నానంబులు చేసి ప్రతిమారూపులగుతత్తీర్థాధిదేవతలను దర్శించి దేవర్షిపితరులం గూర్చి స్నానాంగతర్పణంబులొనరించి తమశక్తికొలఁది గో భూ సువర్ణాది షోడశమహాదానంబులు సెసిరి ముత్తైదువలును హరిద్రాస్నానంబులఁ జేసి కుంకుమంబు ధరియించి హరిద్రా కుంకుమ కుసుమ నారికేళాదుల గంగాపూజనం బొనరించిరి తదనంతరంబ సమస్తజనంబులుం జేరి పరిశుద్ధపరిధానపరీతులై మహేశ్వరారాధనంబు సేయం గోరి. 99

మ. వరగంధంబు తిలాక్షతల్ కుసుమముల్ ♦ పణ్యారముల్
బిల్వమున్, మరువంబున్ గురువేరునున్ దవనమున్ ♦
మాల్యంబులున్ ధూపముల్, చెఱకుల్ నిర్మలతీర్థమున్
జలజముల్ ♦ చెంగల్వలున్ దీపముల్, కరపాత్రంబులఁ
దాల్చి చేసిరి జనుల్ ♦ కామారిపూజల్ విధిన్. 100

మ. జననాథుండు శివాభిషేకమునకై ♦ సాయాహ్నకాలంబు
నన్, జను దెంచెన్ బరిచారకుల్ సకలపూజాద్రవ్యముల్
గొంచు రాఁ, గను గాంతాసుతబాంధవుల్ సచివులున్ ♦
గర్పూరముల్ కానుకల్, గొని రా గుంపులఁ బ్రోవి బం
ట్లిరుగడన్ ♦ గొల్వంగ సోత్సాహుఁడై. 101

చ. అనఘులు విప్రు లాత శర ♦ దభ్ర విశుభ్ర విభూతిభూషు లై
మన మలరంగ వేదహిత ♦ మంత్రములన్ భవుపూజ సేయఁగా
వనితలతోడఁ గూడుకొని ♦ భక్తి గణేశుని మున్న గొల్చి
వా, రనుపమశాంక రార్చనల ♦ నాచమనంబులు సేసి రాజుతోన్. 102

శా. కాకోలాదను గేహమం దలరి సం ♦ కల్పంబు గావించి మా
న్యాకారుల్ హరు వేఁడుకొంచును మహా ♦ న్యాసంబు సంధించు
చున్, వీఁకన్ రుద్రము చెప్పి తీర్థజలముల్ ♦ వేమాఱు
లర్పించుచున్, శ్లోకన్ వా రభిషేకమున్ సలిపి రా ♦ జుం
గూడి వా రందఱున్. 103

సీ. గోక్షీర గోదధి ♦ గోఘృత మధుయుక్తి
ఫలరసంబులు భర్గు ♦ పైన నునిచి
ఘనసార కుంకుమ ♦ గంధోదకంబులు
కస్తూరికాగరు ♦ కలితజలము
రూఢిగా నొడఁగూర్చి ♦ రుద్రాభిషేకంబు
లేకాదశావృత్తు ♦ లెన్ని చేసి
రత్నాభిషేకంబు ♦ రవళి గా నొనరించి
కనకాభిషేకంబు ♦ కలిమిఁ జేసి

ఆ. పుణ్యజలముతోడఁ ♦ బూర్ణాభిషేకంబు
చేసి రపుడు వారు ♦ చెలువు మీఱఁ
దూర్యరవము నిండఁ ♦ దుముల మై యంతట
శంఖవేణురవము ♦ సంస్ఫురింప. 104

చ. వసనము గంధ మక్షతలు ♦ బంగరుసొమ్ములు యజ్ఞసూత్ర
మున్, గుసుమము లచ్చబిల్వదళ ♦ కోటిసమర్పణధూప దీప

ముల్, రసయుత మహానివేదనయు ♦ రంజిలుపిండము మంగ
ళారతుల్, మనలకె మంత్రపుష్పము లు♦మాపతి కర్పణ
సేసి యాదటన్. 105

వ. ఛత్ర చామర నృత్య గీత వాదిత్రాదులం బ్రీతునిం జేసి
మహిమ్నాదిస్తుతుల సంస్తవించి దుర్గాపూజ సేయం దలంచి.

క. పసుపు కుంకుమంబు ♦ పచ్చని గంధము పూలు
కప్పురమ్ము విడెము ♦ కంచుకములు
కంకణములు కెంపుం♦గమ్మలు గాజులు
గొనుచుం జనిరి దుర్గ♦గుడికి వారు. 107

క. దుర్గాదేవిని గని జన
వర్గము భక్తిమెయి మ్రొక్కి ♦ వైభవ మెసఁగన్
గర్గాదిమానివర్ణిత
మార్గంబునం బూజ సేసి ♦ మనిరి విభూతిన్. 108

వ. ఇట్లు పూజసేసి యాదేవిముందు నిలిచి కరపుటంబులు
ముకుళించి. 109

సీ. నీచరణారుణ♦నిర్మలకాంతులు
శ్రుతిశిరస్సిందూర♦శోభ గాంచు
నీమహోసజ్యోత్స్న ♦ నిఖిలరాక్షసముఖ
వనజాతవారమున్ ♦ వాడఁజేయు
నీశక్తి దైతేయ♦నికరంబునకు మిత్తి
హత్తి మత్తులఁ బీచ ♦ మణఁచు శక్తి
నీధాటిపరిపాటి ♦ నీటురక్కసిమేటి
రక్తబీజుని మట్టె ♦ కాలఁ గొట్టె,

ఆ. నఖిలభువనసృష్టి ♦ కాధార మగుతల్లి
సిరియు బలము జయము ♦ శీలసుఖము
లఖిలకామసిద్ధి ♦ కాస్పద మగునట్టి
చూడ్కిఁ దోడ మమ్ముఁ ♦ జూచి యిమ్ము. 110

వ. ఇట్లు ప్రార్థించి యద్దేవిని హరిద్రాకుంకుమగంధపుష్పాక్షతల నర్చించి ముత్తైదువుల సమస్తసత్కారంబుల నర్చించి తెసు తమనివాసంబులు చేరునంత. 111

ఉ. కాలనరుండు వేడుకకుఁ ♦ గాంచనకందుక మెత్తి వైవఁగా
వ్రాలుచు నాప్రతీచిసతి♦పజ్జను జేరెనొ నా మహాప్రభా
భీలదివాకరారుణిత♦బింబము భాసిలెఁ బశ్చిమాద్రిపై
ఫాలమునం బ్రతీచిసతి ♦ బాగుగఁ దీర్చినకుంకుమం బనన్.

మ. ఉదయం బంది వసుప్రదానములచే ♦ నుత్కృష్టుఁ డౌ
భాస్కరున్, గదియంగూడినతూర్పువేశ్య యతఁ డ♦కా—
లానురోధంబునన్, గుదు రౌతద్వసువుల్ దొఱంగి ముది
యన్ ♦ గోపించి పోద్రోసినన్, ముద మొప్పన్ జనెఁ బశ్చి
మాత్మసతి స♦మ్మోదింపఁగా రక్తుఁ డై. 113

తే. పదరుచుండెడు మధుపాళి♦పాలఁ బడిన
పుష్పవతు లైనపద్మినీ♦పుంజములను
గదిసి కరముల నంటున♦క్కలుష మెల్లఁ
బాపికొనఁగోరి చరమాద్రిఁ ♦ బడియె నినుఁడు. 114

స్రగ్ధర.
సంధ్యారాగంబు దోఁచెన్ ♦ సకలశకునముల్ ♦ శాఖలన్
జొచ్చె లోకం, బాంధ్యం బొందంగఁ జీకటి ♦ ట్లడరెను దిశ

లం ♦ దంతఁ దారల్ జనించెన్, వంధ్యత్వం బొందె దృష్టల్ ♦
వనరుహచయముల్ ♦ వాఁడి కన్నుల్ మొగిడ్చెన్, వింధ్య
ప్రోద్దామశంభు♦ప్రియభవనముపై ♦ వీఁక దీపాళి మించెన్.
చ. మృగధరుఁడై విశుద్ధతను ♦ మీఱినదేహమునం గళంక
ముక్, దగఁ గడు నున్నతోన్నతప♦దంబున నున్నను సామిఁ
డాతఁడై, న్నఁగ నలసత్ప్రకాశము గ♦నన్ మది నోపఁడటంచు
వచ్చి జీ, క్కఁగమి వెలుంగు నిం దనఁగఁ గ్రందుగ దీపము
లొప్పెఁ గో వెలన్. 116
సీ. బ్రహ్మాండ మెల్ల రు♦ద్రస్వరూపంబుగా
నెంచుచు శర్వుఁ బూ♦జించువారు
హృదయగుహానివి♦ష్టేశ్వరరూపు లై
చిత్స్వరూపంబునఁ ♦ జెలఁగువారు
బంధనిర్ముక్తు లై ♦ పరగుచుండియు రాజ
యోగు లై సంసృతి ♦ నుండువారు
సేవ్యసేవకభావ ♦ మవ్యాజముగ భవు
నందును దమయందు ♦ నొందువారు
తే. లింగముఖచిహ్నముల భవు♦లీల లెల్ల
నిశ్చలంబుగ ధ్యానించి ♦ నిరతిశయసు
ఖాబ్ధి నోలాడువారు నై ♦ యభవుభక్తు
లలర రెల్లెడ నాశివ♦స్థలమునందు. 117
సీ. పార్థివలింగముల్ ♦ పరువుగా సఘురించి
పూజించి భక్తితోఁ ♦ బొంగువారు
ఘంట వాయించి శం♦ఖం బొత్తుచును శివా!
శివ! యని స్తోత్రము ♦ సేయువారు

దీపపాత్రలయందు ♦ దీపముల్ వెలిఁగించి
శివున కర్పిత మంచుఁ ♦ జేర్చువారు
పౌరాణికోత్తముల్ ♦ పఠియించుచున్నట్టి
విశ్వేశ్వరునికథల్ ♦ వినెడివారు
తే. కన్నులు మోడ్చి కదలక ♦ కరములందు
జపసరంబులు దాలిచి ♦ సాంబశివుని
చారుపంచాక్షరీమంత్ర♦జపము సలుపు
వార లందుండి వెలసిరి ♦ భక్తపరులు. 118
వ అట్టియెడ సమస్తజనంబులు దమతమనివాసములయందు
గృహదేవతార్చనలు చేసి తీర్థపరిగ్రహణంబు సేసి. 119
క. పానకమును బణ్యారము
తేనియలును బనసతొలలు ♦ తియ్యనిఫలముల్
నానెంపుగెనసుదుంపలు
దానంబులు సేసి రగ్ర్య♦దంపతితతికిన్. 120
వ. తదనంతరంబ నందీశ్వరుని వివాహోచితసమయం బగు
టయు. 121
చ. పటుపటహాధ్వనుల్ పణవ♦వైణవికాతతికాహళీధ్వనుల్
భటకృతభేరికాధ్వనులు ♦ భాసురఝర్ఝర శంఖరావముల్
ఘటమురజధ్వనుల్ డమరు♦గస్ఫుటమర్దలతాళనాదముల్
నిటలవిలోచనావసథ♦నిస్తులమండపమందు భాసిలెన్. 122
వ. అపు డాగమజ్ఞు లంతకు ముందర గణపతిం గొలిచి స్థూల
స్థాపనంబును శైవపుణ్యాహవాచనంబును గలశస్థాపనంబును
మృత్సంగ్రహ ణాంకురార్పణంబులును ధ్వజపటబంధనంబును
భేరీపూజయు గద్యపద్యతాళగానములతోడ దేవతాహ్వానం

బును శాంతికపౌష్టికహోమంబులును నిర్వర్తించి బలిహార
ణం బొనర్చి కల్యాణమంటపంబుఁ జేరి భవానీభవుల కల్యా
ణోచిత సమస్తసంభారంబులతోడ నుండి రప్పుడు. 123

సీ. తనమహోదయమును ♦ దనమహోదయమట్ల
సన్మిత్రమండల♦సరణి పెనపఁ
దనచంద్రహాసంబు ♦ తనచంద్రహాసంబు
గతి రాజమండల♦గరిమ నొంపఁ
దనధర్మగుణమును ♦ దనధర్మగుణమట్ల
బహుమార్గణాళికిఁ ♦ బ్రాపు గాఁగఁ
దనతురంగంబులు ♦ దనదురంగములట్ల
బహురూపనటనలఁ ♦ బ్రబలుచుండ
తే. భోగదేవేంద్రుఁ డై మించె ♦ బుధజనార్తి
భంజనామలబహుకార్య♦పటలపూర్తి
నిత్యశుభమూర్తి వరనంది♦నిలయవర్తి
చారుతరకీర్తి నందన♦చక్రవర్తి. 124

వ. అమ్మహీకాంతుండు, 125

మ. భటసందోహముతో నటీజనముతోఁ ♦ బౌరప్రజాపాళితోఁ
బటహధ్వానముతోఁ బురోహితులతోఁ ♦ బాటీరగంధంబుతోఁ
జటుభార్యాసుతబంధువర్గములతో ♦ సర్వేశుకల్యాణ మ
చ్చటఁ జేయంగను జేరవచ్చె విభుఁ డం♦చన్మండపప్రాంతముల్.

శా. ఉష్ణీషంబును గంచుకం బమరఁగా ♦ నూర్మిస్ఫురత్పాణి యై
యుష్ణాంశుప్రభ లొల్కు భూషణరుచుల్ ♦ హారంబట్టు
పుట్టంబుపై, నిష్ణాతప్రభ లొప్ప నిండుకొన ని♦ర్నిద్రజ్ఞాన

సంపన్నుఁ డా, విష్ణుప్రాభవుఁ డైనరాజు వెలసెన్ ♦ వేదిప్రదేశస్థలిన్. 127

మ. నరనాథుం డట మంత్రులన్ బిలిచి యా♦నందంబుతోఁ బల్కె నా, బరరాజన్యుని దోడితెచ్చి చెలిమిన్ ♦ బాటించి యువ్వానితోఁ, బరమానందముతోడఁ గూఁతుఁగొని శం♦భచ్ఛాంభు వైవాహికం, బగుదారంగను జేయఁగా వలయు న♦య్యాపోద మచ్చోటికిన్. 128

క. అని పలుకుచు మన మలరఁగ
వినయంబునఁ గదలి రపుడు ♦ విప్రులు దారున్
గనకంపుఁబళ్ళెరంబుల
ఘనశుభవస్తువులు భటులు ♦ గైకొని రాఁగన్. 129

సీ. పరశుపట్టసఖడ్గ♦పాణు లై శూరులౌ
భటకదంబము ముందు ♦ బలిసి నడువఁ
గరదీపికావళి♦కాంతులు మెఱయంగ
మిగిలి తూర్యపుమ్రోఁత ♦ మిన్ను ముట్ట
నాడుచుఁ బాడుచు నందందు వేశ్యలు
నటకదంబముతోడ ♦ నడిచి రాఁగ
మచ్చికముచ్చటల్ ♦ మనవి సేయుచు వెంట
నీటుగా మంత్రులు ♦ నిక్కి రాఁగ

ఆ. రాజు వెడలె శబర♦రాజు నెదుర్కొని
తోడితెచ్చి వాని♦తోడఁ గూడి
నందిమండలేశు♦నయ మైనపెండిలిఁ
జేయఁ గోరి చనియె ♦ శీలఘనుఁడు. 130

వ. ఇట్లు చని తత్ప్రదేశంబు చేరునంత. 131

మ. విభుఁ డానాయఁడు వేడ్కతో నెదురుగా ♦ విచ్చేసి
యవ్వారలన్, సభఁ గూర్చుండఁగఁ బెట్టి గంధపుఁబొడిన్ ♦
జల్లెన్ వినోదించుచున్, రభసం బొప్పఁగఁ బుష్పచందన
ఫల♦వ్రాతంబు తాంబూలముల్, విభవం బొప్పఁగ నిచ్చి
మించెను మహా♦విశ్వాసభూయిష్ఠుఁ డై. 132

ఉ. మెట్టెలు తాళియుం బసుపు ♦ మేలొడిబియ్యము కుంకుమంబు
మైఁ, గట్టఁగఁ బట్టుపుట్టములు ♦ కంచుకముల్ ఫలవారికేళ
ముల్, మిట్టలగట్టుపట్టి కని ♦ మీఱినవేడ్కను జేతఁ బట్టిమే
ల్పట్టపురాణిపిండుఁ గొని ♦ పైనముచేసెఁ గిరాతనేతయున్.

చ. వెడలిరి రాజు లిద్దరును ♦ వీరభటావళి ముందు గొల్వఁగా
వడిగలచివ్వలున్ బిరుసు♦బాణము లచ్చపువెన్నముద్దలున్
గుడి నెడమన్ భ్రమింపఁ గల♦గుండ్రపుబాణము లాడు
చుండఁగా, గుడిఁ గలపెండ్లిమండపముఁ ♦ గూడఁగఁ జేరిరి
వార లందఱున్. 134

వ. ఇట్లు సమస్తజనంబులు వివాహమండపాంగణంబుఁ జేరి
మంగళద్రవ్యంబులు దేవునెదుట నునిచి సాష్టాంగప్రణామం
బులు సేసి చలువచప్పరమందలిచిత్రకంబళమందు సుఖాసీను
లై యున్నంత. 135

తే. గంధతైలంబు పన్నీటి♦గాఁజుబుడ్లు
పువ్వుదండలచెండులు ♦ పునుఁగుబరణి
తమ్మలమ్ములు ఫలములు ♦ తట్టలందుఁ
దెచ్చి యుంచిరి మంత్రులు ♦ దేవునెదుట. 136

క. మధు దధి లాజలు ఘృతమును
మధుపర్కము కంకణములు ♦ మణిభూషితముల్

విధిహితజీరకగుడములు
బుధజనములు గూర్చి రచట ♦ ముంజాక్షతలున్. 137

వ. మఱియు గోఘృతసకర్పూరదీపంబులు కాలాగరుధూపంబులు ప్రకాశించుచుండె నయ్యెడ మౌహూర్తికులు సుముహూర్తకాలం బయ్యె నని నిరూపించుటయు శైవాగమజ్ఞులు విద్వజ్జనుల సంభావించి వారలయనుజ్ఞ గైకొని. 138

—♦ నం దీ శ్వ ర క ల్యా ణో త్స వ ము ♦—

తే. భక్తి సంకల్పపుణ్యాహ♦వాచనములు
సలిపి కన్యావరణ మర్థి ♦ సంఘటించి
పాశుపతదీక్ష దక్షులై ♦ పరమనియతి
నాగమోదితవిధిని దా ♦ మనుసరించి. 139

మ. ఇది యర్ఘ్యంబిది పాద్య మాచమన మం♦ చీరీతి నర్ఘ్యాదులున్, మధుపర్కం బుపవీత గంధ సుమనో ♦ మాల్యాచ్ఛవస్త్రంబులున్, మృదునైవేద్యము సంకిణాలు తొడవుల్ ♦ మే లౌకిరీటంబు లం, గదముల్ కెంపులభాషికాలు పతికిన్ ♦ గామారి కర్పించుచున్. 140

ఉ. పింగళనూత్నరాంకవము ♦ ప్రీతిమెయిన్ దెరనెట్టి వేడ్కకన్ మంగళవాద్యముల్ మొఱయ ♦ మాన్యులువే గుడజీరకంబు లా, మంగళమంగళాష్టకస♦మాదృతి శీర్షములందుఁ బెట్టినన్, మంగళసూత్ర మయ్యఖిల♦మాతకుఁ గట్టిరి కంధరంబునన్. 141

తే. నిండ దోయిట ముత్యముల్ ♦ నించి నించి
పండ్లు పసుపులు రతనముల్ ♦ పయిన నునిచి
మంత్రపూతములం జేసి ♦ మహిమ దనర
మించి తలఁబ్రాలు వోసిరి ♦ మేటిబుధులు. 142

మ. సురసంఘంబులు చల్లుదివ్యసుమముల్ ♦ సూత్రిప్రయుక్తాక్ష
తల్, వరనారీకరముక్తలాజలు దలం♦బ్రాల్ ముత్యముల్
పెద్దలుఁ, బరివారంబులు రాజులుఁ ముదముపెం♦పం జల్లు
మేల్ సేసలుఁ, సరిగా నొక్కముహూర్తమందె పడి
యెఁ ♦ శర్వాణిపై శర్వుపై. 143

తే. సుదతియొక్కతె పువ్వుల♦సురఁటిఁ బూన
సువిద లిద్దరు చామర ♦ లూని వీవ
తాళవృంతము ఛత్రముల్ ♦ తరుణు లిడఁగ
దేవుబలుకీవి మిక్కిలి ♦ తేజరిల్లె. 144

తే. సామగానంబు సేసిరి ♦ సామవిదులు
ఋగ్యజుస్సుల నుడివెను ♦ ఋత్విగాళి
శాస్త్రిచర్చల జరిపిరి ♦ సభ్యు లపుడు
సారెసారెకుఁ బొగడిరి ♦ సరసకవులు. 145

చ. భరతకుమారు లత్తఱిని ♦ బంచమ షడ్జ నిషాద మధ్యమ
స్వరముల వీణియల్ శ్రుతుల♦జాతులజాడ లెఱింగి మీటు
చుఁ, గరములఁ దాళముల్ మొఱయ ♦ ఘల్లనుచుం
గొనుగోలుకీతులఁ, బఱపుచు మర్దలధ్వనులఁ ♦ బాడిరి
పెంపు వహింప రాగముల్. 146

వ. అపుడు వారలమధ్యంబుననుండి వెలువడి. 147

చ. కలితవరాంగరాగములఁ ♦ గ్రమ్మెడుతావులు నింపు గూ
ర్పఁగా, వలిపపుఁబయ్యెదఁ బిగువు ♦ పాయనిచన్గవ నిక్కు
చుండఁగా, నలరులు మేలిసొమ్ములును ♦ హారము లంగము
లందుఁ దోఁపఁగాఁ, బొలిచినమోహినీరమణి♦పోలిక లా వెల
యాండ్రు వేడుకఁ. 148

చ. పడఁతులు కామశాస్త్రఘన♦పండిత లిద్ధభుజంగపుంగవుల్
పడసిననోముపంట లని♦వారితభావజమోహనాస్త్రముల్
చిడిముడి కాముకైణములు ♦ చిక్కువలల్ ఘనగానమాధురీ
కళలకు నిక్కలౌనఁగను♦కత్తెలు మ్రొక్కుచుఁ జేరి రాఁడఁగన్.

ఉ. శ్యామలు వీణసారఁగుల ♦ సారెకు మీటుచుఁ బాడి రాస్వర
గ్రామములందు మూర్ఛనలఁ ♦ గగ్గెసు తానపరంపరావళిన్
గోమలకాకలీకలిత♦ఘూర్జరి కన్నడ మధ్యమావతీ
భ్రామర శంకరాభరణ ♦ భైరవు లాహిరి తోడి నాటలన్.

ఉ. డామరుగారవాతినిక♦టప్రకటభ్రుకటిభ్రుకుంసనం
భ్రామితశస్తహస్తయుగ♦మస్తతమర్దళమార్దవధ్వనిన్
రామలు ముంగురుల్ విస్మృమ♦ర భ్రమర భ్రమిరీతు లొంద నా
యామినిఁ జూపి రిందువిమ♦లాస్యలు వేశ్యలు లాస్యదాస్య
ముల్. 151

ఉ. కొందఱు రాగరంజనలఁ ♦ గొందఱు నృత్యవిశేషపాండితిన్
గొందఱు భావపద్ధతులఁ ♦ గొందఱు నేత్రవిలాసవైఖరిన్
గొందఱు నాంగికాభినయ♦గుంభనఁ గొందఱు రూపరేఖచే
నందఱు నన్ని నేర్పుల న♦హా యని చొక్కఁగఁజేసి రాడుచున్.

వ. తదనంతరంబ. 153

మ. కరపాత్రంబులయందుఁ గప్పురపుఁదు♦న్కల్ వెట్టి ముట్టించి
చూ, పఱు లెన్నంగను హారతుల్ సుదతు లి♦వ్వాం దోఁచె
నాపాత్రముల్, కరకంజారుణకాంతి కోడి రవి యా♦కాంతా
కరాక్రాంతుఁడై, వరదీపాంచితపాత్రికై తవమునన్ ♦ భాసి
ల్లెనో కో! యనన్. 154

వ. అప్పుడు కల్యాణమండపంబు వాల్మీక్యాశ్రమంబునుంబోలి కుశలవాభిరామంబును, మహారథురథంబుపగిది నక్షత్రపరికరాభిరామంబును, బలిగృహాంగణంబుపగిదిఁ బలాశసమిత్ప్రసూనాభిరామంబును, వారవనితాజఘనంబువలె భుజంగశేఖరాధిష్ఠితంబును, బుణ్యపురుషభవనంబురహిని సర్వమంగళాలంకృతంబు నై యుండె నందు యాజ్ఞికులు హోమశేషంబు పరిసమాప్తిం జేసి వేల్పులకు నీరాజనమంత్రపుష్పంబు లొసఁగి రాజు మొదలగువారికి ఫలమంత్రాక్షతలిచ్చిరి. 155

స్రగ్ధర.
ఈరీతిన్ భక్తులెల్లన్ ♦ హిమగిరితనయా♦ధీశకల్యాణకార్యం
బారాధిన్ జేసి రం దా♦యతమతు లగు చ♦న్యోన్యమైత్రిన్
జెలంగన్, హారంబుల్ గంధమాల్యా♦ద్యఖిలశుభపదా♦ర్థావళుల్ గొంచు విప్రుల్, పౌరుల్ రాజన్యవర్యుల్ ♦ పరమముదమునన్ ♦ బొసి రచ్చోటు వంతన్. 156

వ. తదనంతరంబ సమస్తజనంబులు తమతమనివాసంబులు సేరి మహేశ్వరధ్యానంబున రాత్రిశేషంబు గడపి మఱునాఁడు నిత్యకృత్యంబులు దీర్చి. 157

తే. గారె లరిసెలు బూరెలు ♦ కీరు పూరి
లడ్డు పేణీలు మండిగె ♦ లిడ్డెనయును
వడలు నప్పళములు మంచి♦వడియములును
జారు కలవంటకంబులు ♦ చాల చేసి. 158

మ. పరమాన్నంబును సూప శాక ఘృతముల్ ♦ పచ్చళ్ళు
పంచామృతం, బురుశాల్యాన్నము లూరగాయరుచిచే ♦

నొప్పైనచోష్యంబులున్, జెరుఁగుం దేనియ పాలు మీఁగడ
పాఁడుల్ ♦ మే లౌపదార్థంబులున్, ధరణీదేవుల కిష్టభోజన
మిడెన్ ♦ దాంతుండు రా జచ్చటన్. 159

మ. వనవృక్షంబులనీడలందు వెసఁ జాఁ♦పల్ వేసి విప్రాళి నిం
పునఁ గూర్చుండఁగఁబెట్టి గంధములు పూ♦వుల్ పండ్లు
తాంబూల ద, క్షిణ లర్పించి నుతించి వా రిడెడునా♦శీర్వా
దమంత్రాక్షతల్, మన ముప్పొంగఁగఁ బొంది తాను భుజి
యుం♦పం బొామె బంధ్వాళితోన్. 160

వ. అట్లు భోజనంబులు సేసి వివిధవినోదంబుల దినశేషంబు గడపి.

తే. నాఁటిరాతిరి రాజులు ♦ నాగభూషు
నందివాహనమం దుంచి ♦ నటులు గొలువ
నుత్సవఁబులు సేసి రం ♦ దుత్క మీఱి
నందికోలయు మునుమున్న ♦ నడువఁగాను. 162

ఉ. మూఁడవనాఁడు వేడుకను ♦ బుష్పరథఁబును బాగుసేసియుం
దీడుగ సింహముల్ నిలిపి ♦ హేమమణిస్ఫుటకుంభ మెత్తి
కొం, డాడి యనాదిదంపతుల ♦ నం దుపవిష్టులఁ జేసి చూప
ఱుల్, గూడి నుతింప వీథులను ♦ గొల్సుల నిగ్గిరి రాజ
పూరుషుల్. 163

వ. నాఁటిసమయంబున. 164

చ. చెలువలు గప్పుకొప్పులను ♦ జెల్వుగఁ బువ్వులు పెట్టి
పైఠిణీ, వలువలు గట్టి గందమును ♦ బంగరుసొమ్ములు
మేనులందు నిం, పలరఁగఁ దాల్చి గుంపుగ వి♦హారముకై
చని రాజవీథిలో, పలఁ గలవస్తుజాలమును ♦ వాంఛఁ గనుం
గొని రందు మెచ్చుచున్. 165

క. బొమ్మలు కుంకుమ గాజులు
కమ్మలు రవికెలును లక్ష♦కమ్ములు చీరల్
కొమ్మని సాధ్వుల కిచ్చుచుఁ
గొమ్మలు మఱికొన్ని తాము ♦ గూర్చిరి తమకున్. 166

ఉ. నాలవనాఁడు సంగమము ♦ నాఁగఁ బ్రసిద్ధి వహించు వేళ నా
బాలశశాంకమౌళిగిరి♦బాలల డోలలఁ జేర్చి తైలముల్
జాల గ్రహించి పుష్కరిణిఁ ♦ జయ్యనఁ జేరి త్రిశూలవారిచేఁ
దాలిమిఁ జేసి రాయవభృ♦థం బనుమజ్జన ముజ్జ్వలత్వరన్.

వ. ఇట్లవభృథస్నానంబు సేసి మడువు వెలువడి తీరంబుఁ జేరి సమస్తజనంబులు ధౌతపరిధానపరివృతులై భవానీభవుల మండపంబుఁ జేర్చి దేవతోద్వాసనధ్వజపటవిసర్జనాదికృత్యంబులు నిర్వర్తించి రుచిరాన్నంబులు విప్రపురస్సరంబుగా భుజియించి యుత్సవంబుతో వెన్కొన నుత్సవమూర్తులఁ జేకొని నిజపరివారపరివృతుండై రాజవల్లభుం డట నంద్యాలయంబుఁ జేరెఁ గిరాతనేతయుఁ దనయునికిపట్టు ముట్టె నని. 168

శా. ఆనందించుచు శంకరుండు ఘనుఁడ♦త్యాశ్చర్య మీవృత్తముల్,
ధ్యానాసక్తుఁడు పార్వతీసతికి న♦త్యంతానురాగంబుతో,
రాణింపంగను జెప్పినట్లు జటిల♦వ్రాతంబుతో సూతుఁడున్,
సూనస్యందిమరందబిందురుచిభృ♦త్సూక్తిన్ వచించె దగన్. 169

ఆ. నిత్యసుఖకరంబు ♦ నిర్వాణదాయకం
బాత్మశుద్ధిదంబు ♦ నమల మైన

నందినిలయకథను ♦ నయముగా వ్రాసిన
వినినఁ జదువ శుభము ♦ విస్తరిల్లు. 170

మఱిగళమహాస్రగ్ధిపృత్తము.

మంజులకదంబవన♦మందిరనివాసిని! స♦మంచితభుజాకలిత
వీణా, వ్యంజితనిషాదముఖ♦భంగికలగానరస♦పల్లవితదారు
మయకోణా!, కంజజమురారిభవ♦కాంక్షితకటాక్షవతి!♦
కంపితమహాదనుజసేనా!, రంజితకళాభరణ! ♦రాజితధరా
వరణ! ♦ రాజదహిభూషరమమాణా!. 171

మాలిని.

అరుణకిరణలీలా! ♦ హారికౌసుంభచేలా!
ఘనజఘనవిశాలా! ♦ కల్పితాజాండజాలా!
తరళతరళమాలా! ♦ దైత్యసంహారశీలా!
సురవరమణిసాలా! ♦ శూలినీ! శైలబాలా!. 172

గద్యము:

ఇది శ్రీసీతారామసేవాహేవాకనవనవకవితాప్రవీణ బుధ
జనవిధేయ శాండిల్యసగోత్రపవిత్ర తిమ్మామ్మాభట్టసుధీపుత్ర
శేషయసూరిప్రణీతంబగు మహానంది మహిమాభివర్ణనంబను
మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

సర్వము సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.